శ్రీరస్తు.

శ్రీసద్గురవేనమః.

శ్రీరామచంద్ర హనుమంత సంవాదరూపంబగు

# ఉపనిషత్సార రత్నావళి.

తాత్పర్యసహితము, వేదాంతగ్రంథము,

ఇందులో ముందుకంటె విశేషముగా అనేక

ఉపనిషత్తులను చేర్చబడియున్నది.

ఇది,

శ్రీమాన్ - పోకల - శేషాచలాహ్వయ సద్గురు

ప్రియశిష్యులగు,

అం[illegible]తకానుభవి - వకుళాభరణ పరదేశి

వారిచే రచింపంబడి,

చెన్నపట్టణము



బ్రాహ్మో ఆర్ఫన్ అసైలం ముద్రాక్షరశాలయందు

1906 - సంవత్సరం.

రెండవ కూర్పు 1000 కాపీలు.

ముద్రింపంబడియె,



ప్రకటింపంబడియె.

MADRAS.

THE BRAHMO ORPHAN ASYLUM PRESS.

1906.

*Second Edition 1000 Copies.*



దీనివెల-8-అణాలు.

# వేదాంతగ్రంథముల ప్రకటన పత్రిక

1. వేదాంతసార ప్రశ్నోత్తర రత్నావళి-అను-గురుశిష్య సంవాదము, వేదాంతగ్రంథము.—ఇది వచనకావ్యము. ☞ [ఇందులో సర్వసారోపనిషత్తు, నిరాలంబోపనిషత్తు, అమృతబిందూపనిషత్తు, మైత్రేయోపనిషత్తు, అనెడి ఈనాలుగు ఉపనిషత్తులున్ను మొదటనుండి కడవరకు సంపూర్ణముగా తాత్పర్యముతోడనున్నది.] మఱియు ఇందు అనేకఉపనిషత్తులు తాత్పర్యంబుతోడనున్నవి. దీనివెల-1-రూపాయి. వి. పి. పోస్టేజి చార్జితో, 1-2-0.

2. శుకబ్రహ్మ కైవల్యమను, శ్రీశుకమహాఋషి చరిత్ర. ఇది అతి విచిత్రమై శృంగారముగానుండుకథ. ఇందు శుకమహాఋషికిన్ని రంభకున్ను జరిగిన సంవాదము మిగుల చమత్కారముగాను శృంగారముగానుండును, దీనిని జదువువారికే ఇంకలి శృంగారరసము తెలుసునుగాని నావలనంజెప్పుటకు అలవికాదు. మఱియు ఇందులో ☞ [నారాయణోపనిషత్తు, ఆత్మోపనిషత్తు, ఈరెండున్ను సంపూర్ణముగా తాత్పర్యంబుతోనున్నది దీనివెల-12- అణాలు.-వి. పి. పోస్టేజి చార్జితోడ-14-అణా

3. దృగ్దృశ్య వివేకము - అను-వేదాంత గ్రంథము, తాత్పర్యసహితము. ఇది శ్రీ విద్యారణ్యస్వామి విరచితము. దీనివెల - 10 - అణాలు.—వి. పి. పోస్టుచార్జితోడ - 12- అణాలు.

4. వేదాంతరహస్యసర్వస్వము - అను - జ్ఞానసుందరి వివేకసుందరికిం జెప్పినట్టి నూతనవిచిత్ర పతివ్రతల కథలు, దీనివెల-10-అణాలు వి. పి. పోస్టేజిచార్జితో-12-అణాలు.

6. బ్రహ్మజ్ఞాన చింతామణి-అను-సుగుణాకర మహారాజుకథ. ఇది వచనకావ్యము.—మిగుల శృంగారమైన అతివిచిత్రమైనకథ. దీని వెల - 6 - అణాలు.—వి. పి. పోస్టేజిచార్జితో-8-అణాలు,

7. పరమాత్మలక్షణబోధిని, ఇది పద్యకావ్యము.—టీకా తాత్పర్యసహితము, దీనివెల-6-అణాలు. వి. పి. పోస్టేజిచార్జితో-8-అణాలు

8. సచ్చిదానందబోధామృతము- అను-రాజహంస పరమహంస సంవాదము, ఇది వచనకావ్యము. దీనివెల-8-అణాలు-వి. పి. పోస్టేజి-చార్జితోడ - 10 - అణాలు. ఇట్లు, గ్రంథకర్త,

☞ అపరోక్షానుభవి - వకుళాభరణ పరదేశి.

(16) నెంబరుగల గృహము, ముల్లాసాహేబు వీ. చెన్నపట్టణము.

# విషయసూచిక.



## ఎచ్చరిక.

ఇది రెండవ కూర్పు గ్రంథము. ఇందులో ముందుండిన ఉపనిషత్తులకంటెను ఇంకా విశేషముగా అనేక ఉపనిషత్తుల తాత్పర్యము తోడ నూతనముగా చేరియున్నవి. అవశ్యము దీనిలోని చదువండి.



శ్రీరస్తు.

శ్రీ సద్గురవే నమః.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః.

2 8 1

తాత్పర్య సహితంబగు

# ఉపనిషత్సార రత్నావళి.

అను,

## శ్రీరామచంద్ర హనుమంత సంవాదము.

వేదాంతము.

### —* శ్రీరామచంద్ర స్తుతి. *—

శ్లో॥ శ్రీరామం-త్రిజగద్గురుం-సురవరం-సీతామనో-నాయకం। శ్యామాంగం-శశికోటికాంతి-వదనం-చంచత్కళా-కౌస్తుభం। సౌమ్యం-సత్యగుణోత్తమం-సుసరయూ-తీరే-వసంతం-ప్రభుం। త్రాతారం-సకలార్థసిద్ధి-సహితం-వందే-రఘూణాం-పతిం ॥—॥

### —* శ్రీసీతా దేవి స్తుతి. *—

శ్లో॥ మాణిక్య-మంజీర-పదారవిందాం। రామార్క-సంఫుల్ల-ముఖారవిందాం। భక్తప్రదాతృత్వ-కరారవిందాం। దేవీం-భజే-రాఘవ-వల్లభాం-తాం ॥—॥

### —* శ్రీ ఆంజనేయ స్తుతి. *—

శ్లో॥ ఆంజనేయ-మతిపాటలాననం-కాంచనాద్రి-కమనీయ-విగ్రహం। పారిజాత-తరుమూల-వాసినం-భావయామి-పవమాన-నందనం॥—॥

# ఉపనిషత్సార రత్నావళి-తాత్పర్యసహితము.

శ్రీమదనంత నిగమాంతవేద్య సత్యజ్ఞానానంద నిత్యనిర్మల శ్రీరామచంద్ర పరబ్రహ్మంబును మత్సద్గురుస్వామిని మనంబునం దలంచి శ్రీరామచంద్ర హనుమంత సంవాదరూపంబున వేదసారంబగు ఉపనిషత్తులను తాత్పర్యంబుతోడ నెల్లవారికి సులభముగా దెలియునట్లు ఈ గ్రంథరూపంబునం బొందుపఱచి ఉపనిషత్సార రత్నావళి యనం బేరిడి దీనిం బ్రకటింపఁజేసితి. ఇది శ్రీరామచంద్ర సద్గురుకటాక్షంబులవలన ఆచంద్రార్కమై వెలయుంగావుత.

## —* ఉపనిషత్తులు ప్రారంభము. *—

శ్రుతి॥ అయోధ్యానగరే-రమ్యే- రత్నమంటప-మధ్యమే। సీతా-భరత-సౌమిత్రి-శత్రుఘ్నాద్యైః-సమన్వితం। సనకాద్యై-ర్మునిగణై-ర్వసిష్ఠాద్యైః-శ్శుకాదిభిః। అన్యై-ర్భాగవతైశ్చాపి-స్తూయమాన-మహర్నిశం। ధీవిక్రియా-సహస్రాణాం-సాక్షిణం-నిర్వికారిణం। స్వరూపధ్యాన నిరతం-సమాధి-విరమే - హరిం। భక్త్యా-శుశ్రూషయా-రామం-స్తువన్-పప్రచ్ఛ- మారుతిః॥—॥ ముక్తికోపనిషత్తు.

తాత్పర్యము॥ శ్రీమన్మహా భూమండలంబున అయోధ్యానగరంబున నవరత్నఖచిత స్వర్ణసింహాసనంబున శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న సహితుండై కూర్చుండి, సనక సనందన వసిష్ఠ శుక శౌనక పరాశర వ్యాసాది మహాఋషిగణంబులును పరమ భాగవత జనులును పెక్కువిధంబుల తన్నుస్తుతించి సేవించుచుండగా, ఆశ్రితజన పాపంబులంబోగొట్టి రక్షించుచువాడును, దేహేంద్రియాంతఃకరణ తద్వృత్తులకు సాక్షిగానుండువాడును, నిర్వికార పరబ్రహ్మంబును సర్వేశ్వరుండును నైన శ్రీరామచంద్రుండు స్వస్వరూపానుసంధానంబున పరమానందుండై చొక్కుచు కొంతసేపటికి సమాధి చాలించియుండు సమయంబున

పరమభాగవత శిఖామణియగు శ్రీఆంజనేయుండు అతనిపాద సేవ చేయుచు అతనిం బెక్కు విధంబుల స్తుతించి యిట్లనియె.—

శ్రుతి॥ రామ-త్వం-పరమాత్మాసి-సచ్చిదానంద-విగ్రహః।
ఇదానీం - త్వాం - రఘుశ్రేష్ఠ - ప్రణమామి - ముహుర్ముహుః॥
త్వద్రూపం - జ్ఞాతు - మిచ్ఛామి - తత్వతో - రామ-ముక్తయే।
అనాయాసేన - యేనాహం - ముచ్యేయం-భవబంధనాత్। కృపయా-వద మే-రామ-యేన-ముక్తో-భవామ్యహం॥—॥ముక్తికోపనిషత్తు.

తాత్ప॥ స్వామీ రామచంద్రా! సచ్చిదానంద స్వరూపుండును పరమాత్ముండును నైన మీకు మాటిమాటికి నమస్కరించుచున్నాను. స్వామీ! దేవరవారి నిజరూపంబును అనాయాసముగా దర్శించుటకును నిజముక్తిఁజెందుటకును సులభమగు మార్గంబును తమదాసుండగు నాయందు సంపూర్ణ కటాక్షముంచి తెలుపవలయునని అతివినయ భయభక్తులతోడ వేడుకొనగా శ్రీరామచంద్రుండు కరుణాంతరంగుండై ముఖంబున చిఱునగవులొలయ యిట్లనియె.—

—✱ పంచవిధ ముక్తులు. ✱—

శ్రుతి॥ సాధు-పృష్టం-మహాబాహో - వదామి - శ్రుణు-తత్త్వతః॥—॥ముక్తికోపనిషత్తు.

తాత్ప॥ ఓ మహా బాహుపరాక్రమశాలియగు ఆంజనేయా! నీవు మిక్కిలి బుద్ధిశాలివి దేవతలకైనను అలవిగాని ప్రశ్న జేసితివి. శ్రద్ధతో వినుము, సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్య విదేహకైవల్యములని పంచవిధ ముక్తులుగలవు.

శ్రుతి॥ దురాచార-రతో-వాపి-మన్నామ - భజనాత్కపే।
సాలోక్య-ముక్తిమాప్నోతి-నతు-లోకాంతరాదికం॥ —॥ముక్తికోపనిషత్తు.

తాత్ప॥ ఆంజనేయా! ఎట్టి దురాచారుండైనను శ్రీరామ

శ్రీరామ శ్రీరామయని నానామసంకీర్తనంబు జేయుచుండెనేని, వాడు సాలోక్యముక్తిని జెందగలడు. కర్మనిర్మితంబులై నశ్వరంబులైన స్వర్గాది పదవులను జెందజాలడు.— సాలోక్యమనగా శ్రీహరిలోకంబున వసించుట.—

శ్రుతి॥ కాశ్యాంతు - బ్రహ్మనాళేస్మిన్ - మృతో-మత్తారమాప్నుయాత్। పునరావృత్తి-రహితాం - ముక్తిం-ప్రాప్నోతి-మానవః॥ యత్రకుత్రాపివా - కాశ్యాం-మరణే-సమహేశ్వరః। జంతోర్దక్షిణ-కర్ణేతు-మత్తారం- సముపాదిశేత్॥ నిర్ధూతాశేష-పాపౌఘో-మత్సారూప్యం-భజత్యయం॥—॥ముక్తికోపనిషత్తు.

తాత్ప॥ అంజనేయా! కాశీక్షేత్రంబునందు బ్రహ్మనాళమను ప్రదేశంబున మరణించినవాడు, శ్రీరామ అనెడి నాయొక్క తారకమంత్రంబును ఉపదేశమును పొందినవాడగుచు పునరావృత్తిలేనట్టి ముక్తినిజెందగలడు. ఎట్లనగా కాశీక్షేత్రంబునందు పంచక్రోశములలో ఏచోట నైనను మరణించినవానికి పరమశివుండైన కాశీ విశ్వనాథస్వామి వానికుడిచెవియందు శ్రీరామ అనెడి నాయొక్క తారకమంత్రమును ఉపదేశించుచున్నాడు, అందువలన వాడు సకలపాపములు నశించినవాడై నాసారూప్యముక్తినిజెందగలడు.—సారూప్యముక్తి అనగా శ్రీహరివలె రూపమునుపొంది అతనితోడ విహరించుచుండుట.

శ్రుతి॥ సదాచార -రతోభూత్వా-ద్విజో-నిత్య-మనన్యధీః। మయి-సర్వాత్మకే - భావో - మత్సామీప్యం-భజత్యయం॥—॥ ముక్తికోపనిషత్తు.

తాత్ప॥ అంజనేయా! వేదశాస్త్రసమ్మతములగు సత్కర్మ సదాచారములుగలిగి నన్నుతప్ప ఇతరమందు ఆశలేనివాడై సర్వస్వరూపుడనగు నాయందు భక్తిగలిగి నన్ను ధ్యానించుచుండువాడు నాసామీప్యముక్తిని జెందగలడు.—సామీప్యమనగా శ్రీహరి సమీపంబున జేరుట.

శ్రుతి। గురూపదిష్ట-మార్గేణ ధ్యాయన్మద్రూప-మవ్యయం। మత్సాయుజ్యం-ద్విజ-స్సమ్యగ్భజేత్-భ్రమరకీటవత్ ।—॥ ముక్తికోపనిషత్తు.

తాత్ప॥ ఆంజనేయా ! సద్గురుముఖంబున బోధింపబడిన మార్గంబున నన్ను ధ్యానించువాడు నాసాయుజ్య ముక్తినిజెంద గలడు. సాయుజ్యమనగా (భ్రమరకీటక) న్యాయమున అనగా భ్రమరముచే గూటిలోనుంచబడిన పురుగు ఆభ్రమరముయొక్క భ్రమణమువలన భయముజెంది ఆభ్రమరంబునే ధ్యానించుచు, ఆపురుగు ఆభ్రమరరూపమును బొందునట్లు, శ్రీహరియందు కలిసి ఐక్యమగుట.—

శ్రుతి। సైవ - సాయుజ్య - ముక్తిస్స్యాత్ - బ్రహ్మానందకరీ - శివా ॥ చతుర్విధాచ - సాముక్తి - ర్మదుపాసనయా - భవేత్ ॥—॥ ముక్తికోపనిషత్తు.

తాత్ప॥ ఆంజనేయా! ఈనాలుగువిధ ముక్తులలోపల సాయుజ్యముక్తియే శ్రేష్ఠమైనది, బ్రహ్మానందమును గలుగజేయునది, మంగళకరమైనది. ఈ సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యములనెడి నాలుగువిధ ముక్తులున్ను నాయొక్క సాకార రూపమును భక్తితోడ ఉపాసించువారికి వారివారి భక్తి పరిపక్వానుసారముగా లభించును.—

శ్రుతి॥ కైవల్య-ముక్తిరేకైవ-పారమార్థిక-రూపిణీ॥జ్ఞానం-లబ్ధ్వా-చిరాదేవ - మామకం - ధామ - యాస్యసి ॥—॥ ముక్తికోపనిషత్తు.

తాత్ప॥ ఆంజనేయా! అయిదవదియగు విదేహకైవల్యమనెడిముక్తియే అన్నిముక్తులలోపల శ్రేష్ఠమైనది, ఇదేనాయొక్క యథార్థస్థానము. ఈకైవల్య జ్యోతిస్స్వరూపమే నాయొక్క నిజమైనస్వరూపము. ఈకైవల్యముక్తియే నిజమోక్షమనబడును. ఇది కేవల బ్రహ్మాత్మా అభేద అద్వైత జ్ఞానముగలవా

రికి సిద్ధించును గాని తక్కినవ్వారికి సిద్ధింపదు. కాబట్టి నీవు అట్టి అద్వైత బ్రహ్మజ్ఞానమును గలవాడవైతివేని విదేహకైవల్య ముక్తిని జెందగలవు.

శ్రుతి॥ అష్టోత్తర-శతోపనిషదం-విధివదధీత్య। శ్రవణ-మనన-నిదిధ్యాసనాని-నైరంతర్యేణ-కృత్వా। ప్రారబ్ధ-క్షయా-ద్దేహత్రయ-భంగం-ప్రాప్యోపాధి-వినిర్ముక్త-ఘటాకాశవత్-పరిపూర్ణతామేతి। విదేహముక్తి-స్సైవ-కైవల్యముక్తిరితి। అతఏవ-బ్రహ్మలోకస్థా-అపి-బ్రహ్మ-ముఖా ద్వేదాంత-శ్రవణాది-కృత్వా-తేనసహ-కైవల్యం-లభంతే। అతః-సర్వేషాం-కైవల్య-ముక్తిర్జ్ఞాన-మాత్రేణోక్తా। నకర్మ-సాంఖ్య-యోగోపాసనాదిభి-రిత్యుపనిషత్॥—॥ముక్తికోపనిషత్తు.

తాత్ప॥ ఆంజనేయా! మోక్షాపేక్షగలవాడు నూటయెనిమిది ఉపనిషత్తులను సద్గురుముఖంబున యథావిధిని అర్థముతోడ సంపూర్ణముగా జదివి సదా వేదాంత శ్రవణ మనన నిదిధ్యాసనంబులు చేయుచు బ్రహ్మాద్వైత జ్ఞానంబుగలిగి, బ్రహ్మాత్మా అభేద ఐక్యానుసంధానంబు చేయుచు ప్రారబ్ధకర్మంబు నశించినతోడనే దేహత్రయమున్ను నశించి, ఘటోపాధి నశింపగానే ఆ ఘటాకాశము మహాకాశంబునగలసి ఏకమైనట్లు, అతని ఆత్మ శుద్ధనిర్గుణ నిరాకార పరిపూర్ణ పరబ్రహ్మమునందు ఐక్యమగుచు ఆ పరబ్రహ్మ స్వరూపమగునదై విదేహముక్తియనియు కైవల్యముక్తి యనియు చెప్పబడును. — [ శ్రుతి॥ జ్ఞానాదేవతు-కైవల్యం-ప్రాప్యతే-యేన-ముచ్యతే॥, తమేవం-విదిత్వాతి-మృత్యుమేతి॥, నాన్యః పంథా-విద్యతేయనాయ॥, జ్ఞాత్వా-దేవం-ముచ్యతే-సర్వపాశైః॥, విద్యయామృత-మశ్నుతే।, జ్ఞానేన-విద్వాంస్తేజ-అభ్యేతి నిత్యం॥, నవిద్యతే-హ్యన్యథా-తస్య-పంథాః॥ ] ఇత్యాది శ్రుతివాక్యరీతిని ఈకైవల్యముక్తి సకలముక్తులలోపల శ్రేష్ఠమైనదిగాను, బ్రహ్మజ్ఞానమువలన లభించునదిగాను ఉండుటవలన —

[శ్రుతి॥ తే-బ్రహ్మలోకేషు-పరాంతకాలే-పరామృతాత్పరి - ముచ్యంతి-సర్వే॥] అనెడి కైవల్యోపనిషత్తురీతిగా, సగుణ బ్రహ్మోపాసకులు ఆసగుణబ్రహ్మ లోకమునందుజేరి అతనివద్ద వేదాంత శ్రవణ మనసాదులంజేసి అహంబ్రహ్మస్మిఅనెడి అద్వైత జ్ఞానముగలవారై వర్తింపుచు ప్రళయంబున ఆ సగుణ బ్రహ్మముతోడ వారున్ను పునరావృత్తిలేని విదేహకైవల్యమును జెందుదురు —కాబట్టి అందఱికిన్ని కైవల్యము కి(బ్రహ్మాద్వైత జ్ఞానమువలన సిద్ధించునుగాని)సత్కర్మాను ష్ఠానమువల్లను, సాంఖ్యమువల్లను, ప్రాణాయామాది యోగముల వల్లను, దేవతా ఉపాసనలవల్లను సిద్ధింపదు.—ఇదియే వేదాంతమునందు పరమ రహస్యము.

## —* హరిహర భేదరహితము. *—

[శ్రుతి॥ రామఏవ-పరంబ్రహ్మ॥] అనెడి రామరహస్యోపనిషత్తు రీతిగాను,—[శ్రుతి॥ శివఏవ-స్వయం - సాక్షాదయం - బ్రహ్మ॥]అనెడి-మహోపనిషత్తురీతిగాను [శ్రుతి॥ యోహవై-నృసింహో-దేవో-భగవాన్। యశ్చ-బ్రహ్మా-యశ్చవిష్ణుః-యశ్చ-మహేశ్వరః॥] అనెడి నృసింహతాపిన్యుపనిషత్తురీతిగాను [శ్రుతి॥ యోహవై-రుద్ర-స్సభగవాన్। యశ్చబ్రహ్మా-యశ్చ - విష్ణుః-యశ్చ-మహేశ్వరః॥] అనెడి అథర్వశిఖోపనిషత్తు రీతిగాను- [శ్రుతి॥ త్వం-యజ్ఞ-స్త్వం- వషట్కార-స్త్వమింద్ర - స్త్వంరుద్ర-స్త్వంవిష్ణు-స్త్వంబ్రహ్మ-త్వం-ప్రజాపతిః॥] అనెడి- తైత్తిరీయ ఉపనిషత్తురీతిగాను-అంజనేయా! విష్ణువగు నేనున్ను పరమశివుడున్ను మేమిద్దఱమున్ను ఏకపరబ్రహ్మ స్వరూపులము. కాబట్టి విష్ణువగునేనే పరమశివుడు, పరమశివుడే నేను, మాయిద్దఱికిని ఎంతమాత్రము భేదములేదుసుమా?-[శ్రుతి॥ శివాయ-విష్ణురూపాయ-శివరూపాయ-విష్ణవే। శివస్య-హృదయం-విష్ణు - ర్విష్ణోశ్చ-హృదయం-శివః। యథాంతరం-నపశ్యామి- తథామే -

స్వస్తి-ర్నాయుషి। యథాంతరం-నభేదాస్య-శ్శివకేశవయో - స్తథా॥]అనెడి స్కాందోపనిషత్శ్రుతిరీతిగా,విష్ణురూపముగానుండు శివునకున్ను శివరూపముగానుండు విష్ణువుకొఱకున్ను నమస్కరించుచున్నాను. శివునియొక్క హృదయమే విష్ణువు, విష్ణువుయొక్క హృదయమే శివుడు,ఎట్లు ఈ శివవిష్ణువులు ఇద్దరియందును నాకు భేదము కనబడలేదో, అట్లు నాకు సంతోషమున్ను దీర్ఘాయువున్ను గలుగుగాక; శివకేశవులలో కొంచెమైనను భేదములేదు, అనియిట్లు హరిహరులగు మాయిద్దఱిని అభేదముగా భావించి, ధ్యానించువాడే ధన్యుడు. ఇది సత్యము సుమా? మరియు ఆంజ

## —* బ్రహ్మస్వరూపము ద్వివిధములు *—

నేయా! శ్రద్ధతోవినుము.—[శ్రుతి। ద్వే-విద్యే-వేదితవ్యే-పరాచైవాపరాచ! అథ-పరాయ-యా-తదక్షర-మధిగమ్యతే।]అనెడి ముండకోపనిషత్శ్రుతిరీతిగా, సాకార నిరాకారములని నాకు రెండువిధములగు స్వరూపములుగలవు. అందులో నిరాకారస్వరూపమును నిర్గుణమనియు పరమనియు చెప్పబడును. సాకార స్వరూపమును సగుణమనియు అపరమనియు చెప్పబడును.— [శ్రుతి॥ ఏతద్వై-సత్యకామ-పరంచాపరంచ-బ్రహ్మ - యదోంకారః-స్తస్మాద్విద్వా-నేతేనైవాయతనే- నైకతర-మన్వేతి॥] అనెడి ముండకోపనిషత్శ్రుతిగాను మరియు [శ్రుతి॥ ఏతదాలంబనం-జ్ఞాత్వా-యో-యదిచ్ఛతి-తస్యతత్॥] అనెడి కఠోపనిషత్శ్రుతిని ఆంజనేయా! నాసాకార నిరాకార స్వరూపములలో యేయే విద్వాంసుడు దేనిదేని కోరి ధ్యానించునో, వాడు వాడు అంత్యంబున ఆయా స్వరూపమును జేరగలడు. — [శ్రుతి॥ తురీయం-నిరాకారం-బ్రహ్మ॥] అనెడి మహానారాయణోపనిషత్శ్రుతిని ఆంజనేయా! నిరాకారమే నానిజస్వరూపము. అదెట్టిదనగా— [శ్రుతి। యత్తదద్రేశ్య- మగ్రాహ్య-మగోత్ర - మవర్ణ-మచక్షు-శ్శ్రోత్రం। తదపాణి- పాదం-నిత్యం-విభుం - సర్వ

గతం-సుసూక్ష్మం! తదవ్యయం-యద్భూతయోనిం- పరిపశ్యంతి-ధీరాః॥] అనెడి ముండకోపనిషత్తురీతిగా, నానిజస్వరూపమైన నిరాకారస్వరూపము నేత్రములకు కనబడనిది, మనస్సుచే ఇట్టిదట్టిదని ఊహింపరానిది, గోత్రము వర్ణము నేత్రము శ్రోత్రము కరచరణాది అవయవములు లేనిది, నిత్యమైనది, త్రివిధ పరిచ్ఛేదములు లేనిది, సర్వపరిపూర్ణమైనది, సర్వవ్యాపకమైనది, ఎన్నటికిని నాశములేనిది, సకలభూతములు పుట్టుటకు జన్మస్థానమైనది. అట్టి నానిజస్వరూపమును బ్రహ్మజ్ఞానులు తమయొక్క ఆత్మస్వరూపముగా నెరింగి సదా స్వస్వరూపమును దర్శించుచుందురు మరియు-[శ్రుతి। మాయాంతు-ప్రకృతిం-విద్యాత్। మాయినంతు-మహేశ్వరం। తస్యావయవ భూతైస్తు-వ్యాప్తం॥] అనెడి శ్వేతాశ్వతరోపనిషత్తురీతిగా అంజనేయా! అట్టి నిరాకార పరబ్రహ్మమగు నేను మాయాశబళితుండనై రూపనామక్రియలు గలవాడనై సాకార బ్రహ్మమనియు, మహేశ్వరుండనియు, భగవంతుండనియు సగుణబ్రహ్మమనియు చెప్పబడుచు, ప్రపంచ సృష్టిస్థితి సంహారాది కార్యములు చేయుచుందును.-[శ్రుతి॥యథోర్ణనాభి-సృజతే-గృహ్ణతేచ॥] అనెడి ముండకోపనిషత్తు రీతిగాను, మరియు -[శ్రుతి। యథోర్ణనాభి- స్తంతునోచ్చరే- ద్యథాగ్నేః - క్షుద్రా-విస్ఫులింగా-వ్యుచ్చరంత్యేవ-మేవాస్మా-దాత్మన-స్సర్వే ప్రాణా-స్సర్వే- లోకా-స్సర్వే- దేవా-స్సర్వాణి-భూతాని-వ్యుచ్చరంతి॥] అనెడి బృహదారణ్యోపనిషత్తురీతిగాను, ప్రజ్వరిల్లుచుండెడి అగ్నియందుండి అల్పములైన అగ్నికణములు పుట్టునట్లున్ను; సాలెపురుగు తనగర్భమునందుండి తంతువులను వెలుపలికి విడుచుచు మరల యథాప్రకారము ఆతంతువులను తనగర్భములోపలికి ఈడ్చుకొనునట్లు, భగవంతుండనగు నేను నాయందుండి ఈ చరాచర ప్రపంచంబును సర్వంబును పుట్టించుచు మరల నాయందే లయింప జేసుకొనుచుందును.—[శ్రుతి॥ఉపా

సకానాం-కార్యార్థం-బ్రహ్మణో-రూపకల్పనా॥] అనెడి రామతాపిన్యుపనిషత్తురీతిని, రూపనామ క్రియలులేని నిరాకార పరబ్రహ్మమగునేను మాయాశబలితుండనై ఈశ్వరరూపమునుజెంది ఉపాసకులగు నాభక్తులను రక్షించుటకుగాను దశరథమహారాజునకు పుత్రుడుగా అవతరించితిని.— కేవల నిరాకార బ్రహ్మమగు నాయందు ఈరూపనామములు మాయాకల్పితంబులుగాన ఇది నాకు మిథ్యాస్వరూపము.— [శ్రుతి॥ తదేజతి-తన్నైజతి-తద్దూరే-తద్వంతికే। తదంతరస్య-సర్వస్య-తదు-సర్వస్య-బాహ్యతః॥ ] అనెడి ఈశావాస్యోపనిషత్తురీతిగా, అంజనేయా! కేవల నిరాకార పరబ్రహ్మనగు నేను, తత్వవిచారశూన్యులకు మాయా ఉపాధినిబట్టి (చలస్వరూపుడుగా) అనగా దేహేంద్రియాదులుగలిగి సృష్టిస్థితి సంహారాది కార్యములు చేయుచుండువాడుగాను, మరియు తత్వవిచారణ చేసినట్టి జ్ఞానులకు(అచలస్వరూపుడుగా)అనగా దేహేంద్రియాదులులేని కేవల నిరాకార చైతన్యస్వరూపముగాను తోచుచున్నాను. మరియు పామరులకు బహుదూరములోనుండువాడుగాను, శ్రవణ మననాదులనుజేసిన బ్రహ్మజ్ఞానులకు సమీపములోనుండువాడుగాను తోచుచున్నాను. సకల జీవజంతువులయొక్క శరీరములలోపల అంతఃకరణ సాక్షిగా, కేవలజ్ఞానస్వరూపమైన ఆత్మగా వ్యాపించియున్నాను. ఈమాయా ప్రపంచమునకు వెలుపలను నిండియున్నాను.- [శ్రుతి॥తస్మాత్సాకార-మనిత్యం-నిత్యం-నిరాకారమితి॥] అనెడి- మహానారాయణోపనిషత్తురీతిగా, రూపనామక్రియలు గలిగిన నాసాకార స్వరూపము అనిత్యమైనది. రూపనామ క్రియలులేని నానిరాకార స్వరూపము నిత్యమైనది. సత్యమైనది. ఇదే నానిజస్వరూపము.— [శ్రుతి॥ యత్ర - నాన్యత్పశ్యతి - నాన్యచ్ఛృణోతి - నాన్యద్విజానాతి- సభూమా। యోవై-భూమా-తదమృతం ॥ అథ- య

త్రాన్య-త్పశ్యత్యన్య-చ్ఛృణోతి-అన్యద్విజానాతి-తదల్పం ॥ అథ- యదల్పం-తన్మర్త్యం॥] అనెడి ఛాందోగ్యోపనిషత్తురీతిగాను [శ్రుతి॥ సంపూర్ణ - మన్యత్। న్యూన - మన్యత్ - స్థానం॥ ] అనెడి బృహదారణ్యోపనిషత్తురీతిగాను, ఆంజనేయా! నానిజ స్వరూపమగు నిరాకార స్వరూపము (భూమ మనియు) అనగా అఖండ పరిపూర్ణమనియును, (అమృతమనియు) అనగా, నాశములేనిదనియు, చెప్పబడును.— నాసాకార స్వరూపము అల్పమనియు ఖండమనియు మిథ్యాస్వరూపముగాన (మర్త్య మనియు) అనగా నశించిపోవునట్టిదనియును చెప్పబడును.— [శ్రుతి॥ యోవై-భూమా - తత్సుఖం - నాల్పే - సుఖ-మస్తి।- భూమైవ-సుఖం-। భూమాత్వేవ - విజిజ్ఞాసితవ్య-ఇతి॥] అనెడి ఛాందోగ్య ఉపనిషత్తురీతిగా-ఆంజనేయా! ఏది, (భూమమో) అనగా అఖండ పరిపూర్ణమై నిరాకారస్వరూపముగానున్నదో అదియే నిరతిశయ సుఖస్వరూపమైనది.— (అల్పమునందు) అనగా ఖండస్వరూపమైన సాకారమునందు అట్టి నిరతిశయ సుఖములేదు. అఖండ పరిపూర్ణమగు నిరాకారమే నిరతిశయ సుఖస్వరూపమైనది కాబట్టి మోక్షాపేక్షగలవాడు అట్టి నానిజ స్వరూపమగు నిరాకారస్వరూపమును అవశ్యము తెలుసుకొన

—* రామశబ్దార్థము. *—

వలసినదిసుమా?—బుద్ధిమంతుడవగు ఆంజనేయా! శ్రద్ధగలవాడవై వినుము.—[రమతీతి-రామః॥ ] అనునట్లు నేను జ్ఞానుల హృదయములందు రమించుచున్నాను, కాబట్టి నాకు రాముడనెడి పేరుగలిగెను.—మరియు- [శ్రుతి॥ ఆద్యో-రా-తత్పదార్థస్స్యాత్-మకార - స్త్వంపదార్థవాక్-। తయోస్సంయోజన -మసీత్యర్థ-తత్వవిదో-విదుః॥ ] అనెడి రామరహస్యోపనిషత్తురీతిగా -(రా)- అనెడి అక్షరమునకు తత్పద లక్ష్యార్థమైన నిరాకారపరబ్రహ్మము అర్థమగుచున్నది.-(మ)-అనెడి అక్షరమునకు

త్వంపద లక్ష్యార్థమైన ప్రత్యగాత్మ అర్థమగుచున్నది.—కాబట్టి (రామ) - అనగా అట్టి నిరాకార పరబ్రహ్మమే ఒక్కొక్క జీవజంతువునందున్న సాక్షిమాత్రముగా, ఆత్మస్వరూపముగా నున్నదని, బ్రహ్మాత్మా అభేద ఐక్యము అర్థమగుచున్నది. కాబట్టి దేహత్రయ సాక్షిగానుండు ఆత్మయే రాముడని చెప్పంబడును సుమా? మరియు [శ్రుతి॥ రమంతే-యోగినోనంతే-నిత్యానందే-చిదాత్మని-। ఇతి-రామపదేనాసౌ-పరబ్రహ్మాభి-ధీయతే। చిన్మయస్యా-ద్వితీయస్య-నిష్కళస్య-శరీరిణః॥] అనెడి రామతాపిన్యుపనిషత్తురీతిగా- ఆంజనేయా! నానిజస్వరూపమైన కేవల సత్యజ్ఞానానంద నిత్యనిర్మల నిరాకార పరబ్రహ్మస్వరూపమును బ్రహ్మజ్ఞానులు తమయొక్క ఆత్మస్వరూపముగా నెరింగి సదా అట్టి నానిజస్వరూపమగు ఆత్మయందే రమించుచున్నారుగాన, నాకు రాముడనెడి పేరుగలిగెనుసుమా? నానిజస్వరూపంబు వేదాంతంబునందు జెప్పబడియున్నది. కాబట్టి వేదాంతమును విచారించి తెలిసికొంటివేని నానిజస్వరూపంబును దర్శించి నిజమోక్షముం జెందగలవని చెప్పగా, ఆంజనేయుండు స్వామీ! వేదాంతమనగానేమి అనియడుగగా, శ్రీరామచంద్రుండు సాంగంబుగా జెప్పనారంభించెను. ఆంజనేయా! శ్రద్ధతో వినుము, తొల్లి నేను మహాప్రళయంబున శ్రీమన్నారాయణమూర్తి రూపంబున వటపత్రశాయినై జలమధ్యంబున తేలుచుండునప్పుడు- [శ్రుతి॥ నిశ్వాసభూతా-మే-విష్ణోర్జాతా-వేదా-సువిస్తరాః॥] నాయొక్క నిశ్వాసంబులందు ఋక్కు యజుస్సు సామము అథర్వణంబులనెడు నాలుగు వేదంబులను గల్పించి, అందు కర్మభక్తిజ్ఞానానుష్ఠానంబులు ఇట్టివని దెలియపఱచి, దాని లోకులకు ప్రకటించితిని. (శ్రుతి-స్మృతి-ర్మమైవాజ్ఞా॥) కాబట్టి, ఆవేదములు నా ఆజ్ఞావాక్యములనియెరుంగుము. ఆవేదములే శ్రుతులనియు చెప్పబడును, అందులో ఋగ్వేదమూ-౨౧-శాఖలుగాను, యజుర్వేద

ము-౧౦౯-శాఖలుగాను, సామవేదము-౧౦౦౦-శాఖలుగాను, అథర్వణవేదము-౫౦-శాఖలుగానుండును. అందు ఒక్కొక్క శాఖయందును ఒక్కొక్క ఉపనిషత్తుగలదు. వానియందు ముఖ్యముగా-౧౦౮-ఉపనిషత్తులు శ్రేష్ఠంబులు. వానిలో ఒక్కటియైనను గురుముఖంబున పరమభక్తితో పఠించినవాడు సాయుజ్యపదవిని బొందును. అవి యెవియనగా.— (1) ఐతరేయ-కౌషీతకీ-నాదబిందు-ఆత్మప్రబోధ-నిర్వాణ-ముద్గల-అక్షమాలికా-త్రిపురాసార-సౌభాగ్య-బహ్వృచలు-అని, ఋగ్వేదంబున-౧౦-ఉపనిషత్తులు ముఖ్యంబులు.—(2) ఈశావాస్య-బృహదారణ్య-జాబాల-హంస-పరమహంస-సుబాల-మంత్రిక-నిరాలంబ-త్రిశిఖీబ్రాహ్మణ-మండలబ్రాహ్మణ-అద్వయతారక-పైంగల-భిక్షుక-తురియాతీత-అధ్యాత్మ-తారాసార-యాజ్ఞవల్క్య-శాట్యాయనీ-ముక్తికోపనిషత్తులు-౧౯-దిన్ని, శుక్లయజుర్వేదంబున ముఖ్యంబులు.—(3) కఠవల్లీ-తైత్తిరీయ-బ్రహ్మ-కైవల్య-శ్వేతాశ్వతర-గర్భ-నారాయణ-అమృతబిందు-అమృతనాద-కాలాగ్నిరుద్ర-క్షురికా-సర్వసార-శుకరహస్య-తేజోబిందు-ధ్యానబిందు-బ్రహ్మవిద్యా-యోగతత్వ-దక్షిణామూర్తి-స్కంద-శారీరక-యోగశిఖా-ఏకాక్షర-అక్షి-అవధూత-కఠ-రుద్రహృదయ-యోగకుండలినీ-పంచబ్రహ్మ-ప్రాణాగ్నిహోత్ర-వరాహ-కలిసంతరణ-సరస్వతీరహస్యములనెడు-౩౨-ఉపనిషత్తులు, కృష్ణయజుర్వేదంబున ముఖ్యంబులు.—(4) కేన-ఛాందోగ్య-ఆరుణి-మైత్రాయణీ-మైత్రేయీ-వజ్రసూచీ-యోగచూడామణి-వాసుదేవ-మహా-సన్యాస-అవ్యక్త-కుండికా-సావిత్రి-రుద్రాక్షజాబాల-దర్శన-జాబాలీ-ఉపనిషత్తులు-౧౬-న్ను, సామవేదమునందు ముఖ్యములు.—(5) ప్రశ్న-ముండక-మాండూక్య-అథర్వశిర-అథర్వశిఖా-బృహజ్జాబాల-నృసింహతాపినీ-నారదపరివ్రాజక-సీతా-శరభ-మహానారాయణ-రామరహస్య-రామతాపినీ-శాండిల్య-పరమహంసపరివ్రాజక-అన్నపూర్ణ-సూర్య-ఆత్మ-పాశుపత-పరబ్రహ్మ-త్రిపురాతాపన-దేవీ-భావనా-భస్మజాబాల-గణపతి-మహావాక్య-గోపాలతపన-కృష్ణ-హయగ్రీవ-ద

త్తాత్రేయ-గారుడములని- ౩౧ -ఉపనిషత్తులు, అథర్వణవేదమునందు ముఖ్యములు.—ఇందులో మాండూక్యముమాత్రము గురుముఖంబున తాత్పర్యముతోడజదివినవాడు తడలేక నిజమోక్షముంజెందును.[శ్రుతి। తిలేషు-తైలవద్వేదే వేదాంతః-సుప్రతిష్ఠితః॥ అనెడి ముక్తికోపనిషత్తు రీతిగా నువ్వులయందు నూనె ఉండునట్లు, వేదములయందు కడపట జ్ఞానకాండంబున బ్రహ్మజ్ఞానమును దృఢముగా బోధించు వాక్యములే వేదాంతములనియు ఉపనిషత్తులనియు చెప్పబడును. ఆంజనేయా!

## "ఉపనిషత్తనుటకు - అర్థము.

సంస్కృతభాషయందు- (షద్ ల్) - అనెడి ధాతువునుండి ఉపనిషత్తు అనెడిశబ్దముపుట్టెను.—(షద్ ల్-విశరణ - గత్యవసాదనేషు॥) అనునట్లు-(షద్ ల్)-అనెడి సంస్కృతధాతువునకు నాశముచేయుట, హింసించుట, పోవుట, ముగియుట అనియర్థము. కాబట్టి అట్టి (షద్ ల్) అనెడి ధాతువునుండి పుట్టినట్టి ఉపనిషత్తు అనుశబ్దమునకు అజ్ఞానబీజమగు సంసారవృక్షమును నిర్మూలముగాఖండించి, బ్రహ్మలక్షణమున్ను తదైక్యజ్ఞానమున్ను బోధించి, జననమరణములు లేకజేయునదని వ్యుత్పత్తి అర్థము.-[శ్లో॥ ఉపనీయ-మహాత్మానాం - బ్రహ్మాపాస్తి-ద్వయం-తతః। నిహంత్యవిద్యాం-తజ్జాంచ-తస్మా- దుపనిషన్మతం॥] అనెడి ప్రమాణమురీతిగా బ్రహ్మమిట్టిదని తెలియపరచి అజ్ఞానమును పారద్రోలి బ్రహ్మాత్మైక్యమును బోధించునదే ఉపనిషత్తనబడును. కాబట్టి ఆ ఉపనిషత్తుల సారమును సంగ్రహించి చెప్పి బ్రహ్మజ్ఞానమును బోధించెదను, జాగ్రతగా వినుమని ఇట్లనియె.

శ్రుతి॥ అధ్యారోపాప-వాదత-స్స్వరూపం- నిశ్చయీకర్తుం-శక్యతే। తస్మాత్సదా-విచారయే-జ్జగజ్జీవ-పరమాత్మనః॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ వేదాంతవిచారణయందు అధ్యారోపయుక్తి, అపవాదయుక్తి అని, రెండుయుక్తులు గలవు. అధ్యారోపము బంధమును, అపవాదము మోక్షమును పొందజేయును. ఇవి విచారించుటవల్లనే తననిజస్వరూపంబెరింగి ముక్తుడగుచున్నాడుగాన, జగత్తు, జీవుడు, బ్రహ్మ

ము, వీనిలక్షణంబుల బోధించు ఈరెండుయుక్తులనున్ను. సదా విచారించుచుండవలయును.

## అధ్యారోపయుక్తి.

రజ్జువు సర్పముగాదోచునట్లు, ఒకవస్తువు మరియొకవస్తువుగాదోచుట అధ్యారోపమనబడును. అట్లు శుద్ధనిర్గుణ పరబ్రహ్మమందు లేనిమాయాశక్తి ఒకటిగలిగి, దానివలన జగత్తు, జీవేశ్వరులు, గలిగినవిధంబును చెప్పుట అధ్యారోపమనబడును. అది జాగ్రతగావినుమని యిట్లనిరి.

## బ్రహ్మలక్షణము.

శ్రుతి॥ ఏకమేవా-ద్వితీయం-బ్రహ్మ॥ ఛాందోగ్యోపనిషత్తు.

తాత్ప॥ సజాతీయ విజాతీయ స్వగతభేదములులేనిదే పరబ్రహ్మము. ఒకజాతియందే నానాభేదములుగా తోచుట సజాతీయ భేదమనబడును. ఎట్లనగా ఒక్కమనుష్యజాతియందే బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రాది భేదములుగాతోచుట. విజాతీయభేదమనగా ఒకజాతికిని మరియొకజాతికిని గలభేదములు. ఎట్లనగా మనుష్యులకును మృగములకును, దేవతలకును మనుష్యులకును, జీవజంతువులకును చెట్లకును గల వేరువేరుభేదములు. స్వగతభేదమనగా ఒకవస్తువునందే గల భేదములు. ఎట్లనగా ఒకదేహమందే తల చేతులు కాళ్లు కన్నులు మొదలగునట్టి భేదములుగాతోచుట. ఇట్టి త్రివిధ భేదములులేనిదే పరబ్రహ్మము. అనగా బ్రహ్మవిష్ణుమహేశ్వరాది దేవతలున్ను, బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రాది మానవులున్ను, పశుపక్షిక్రిమికీటక, వృక్షలతాదులున్నుగాక, కన్ను ముక్కు చెవులు ముఖము మొదలగు అవయవములులేక, నిరాకారమై నిర్వికారమైయుండునదే పరబ్రహ్మము.

శ్రుతి॥ సత్యం-జ్ఞాన-మనంతం-బ్రహ్మ॥ తైత్తిరీయోపనిషత్తు.—

తాత్ప॥ సత్యజ్ఞానానందమయమే పరబ్రహ్మము.

శ్రుతి॥ అశబ్ద-మస్పర్శ-మరూప-మవ్యయం- తథా-రసం - నిత్య-

మంగధవచ్చ-యత్ । అనాద్యనంతం-మహతః పరం-ధ్రువం-తదేవ-శిష్యత్యమలం-నిరామయం॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ ఆపరబ్రహ్మము శబ్దస్పర్శ రూపరస గంధంబులు లేనిది. నాశములేనిది. ఆదిమధ్యాంతములులేనిది. సత్యమైనది. మాయా అజ్ఞానములులేనిది. ధ్రువమైనది. నిర్మలమైనది. నిరామయమైనది.

శ్రుతి॥ అజాత-మభూత-మప్రతిష్ఠిత-మప్రాణ-మముఖ-మశ్రోత్ర-మవాగమనో-తేజస్క-మచక్షుష్క-మనామ-మగోత్ర-మశిర-మపాణిపాద-మస్నిగ్ధ-మలోహిత - మప్రమేయ-మహ్రస్వ-మదీర్ఘ-మణన్వనల్ప-మపార - మనిర్దేశ్యం॥ సుబాలోపనిషత్తు॥

తాత్ప॥ ఆపరబ్రహ్మము పుట్టుకలేనిది, ఒకరిచేత ప్రతిష్ఠింబడిన విగ్రహాదులవంటిది కాదు. ప్రాణవాయువు ముఖము చెవులు నోరు మనస్సు బుద్ధి నేత్రములు పేరు మొదలైనవిలేనిది. కులగోత్రములు శిరస్సు కరచరణములు మొదలైన అవయవములులేనిది. ఎరువు తెలుపు మొదలగు పంచవర్ణములుగానిది. పొడుగు పొట్టి లావు సన్నము గొప్ప కొంచెము అణువు మహత్తులు మొదలగు రూపములు లేనిది. ల్లలేనిది, అట్టిది ఇట్టిదని ఎంచిచెప్పరానిది.

శ్రుతి॥ పరిపూర్ణ-మనాద్యంత-మప్రమేయ-మవిక్రియం - సద్ఘనం-చిద్ఘనం-నిత్య-మానంద-ఘనమవ్యయం - ప్రత్యగేకరసం-పూర్ణ-మనంతం-సర్వతోముఖం-అహేయ-మనుపాదేయ-మనాశ్రయం - నిర్గుణం-నిష్క్రియం-సూక్ష్మం-నిర్వికల్పం-నిరంజనం-అనిరూప్యస్వరూపం-యన్మవాచామగోచరం-సత్సమృద్ధం-స్వతస్సిద్ధం-శుద్ధబుద్ధమనీదృశం-ఏకమేవాద్వయం-బ్రహ్మ-నేహ-నానాస్తి-కించన ॥అధ్యాత్మోపనిషత్తు.॥

తాత్ప॥ ఆపరబ్రహ్మము పరిపూర్ణమైనది. ఆదిమధ్యాంతములులేనిది. అప్రమేయమైనది. నిర్వికారమైనది. చిద్రూపమైనది. నిత్యమైనది. ఆనందమైనది. నాశములేనిది. ప్రత్యగాత్మగానున్నది. అఖండజ్ఞానస్వరూపమైనది. అంతములేనిది. సర్వపరిపూర్ణమైనది. సర్వోత్కృష్టమైనది. నిరాధారమైనది. శుద్ధనిర్గుణమైనది. నిర్వ్యాపారమైనది. అతిసూక్ష్మ

మైనది. నిర్వికల్పమైనది. నిరంజనమైనది. ఇట్టిదట్టిదని నిరూపింపరానిది. మనోవాక్కులకు అందరానిది. సద్రూపమైనది, చిద్రూపమైనది. తనకుతానేయుండునది. పరిశుద్ధమైనది. కేవల జ్ఞానాకారమైనది. తనకు సమానమగు వస్తువులేనిది. ఒక్కటియైనది. తనకురెండవపదార్థము లేనిది. తనకన్యముగా అణుప్రమాణమగు వస్తువైనను లేనిది.

శ్రుతి॥ చైతన్యం-బ్రహ్మ॥ నిరాలంబోపనిషత్తు.

తాత్ప॥ నిర్విశేష శుద్ధ జ్ఞానమే పరబ్రహ్మము.

శ్రుతి॥ విజ్ఞాన-మానందం-బ్రహ్మ॥-॥ బృహదారణ్యోపనిషత్తు.

తాత్ప। కేవలజ్ఞానానంద స్వరూపమైనదే పరబ్రహ్మము.

శ్రుతి॥ తతఃపవిత్రం-పరమేశ్వరాఖ్యం-అద్వైతరూపం- విమలాంబ
రాభం ॥ పైంగలోపనిషత్తు.॥

తాత్ప॥ ఆపరబ్రహ్మము పరమపావనమైనది. సర్వోత్కృష్టమైనది. తనకు రెండవ పదార్థములేనిది. ఒక్కటియై వెలుంగునది. ఆకాశమువలె రూపములేనిది. అనియిట్లు చెప్పినంతనే ఆంజనేయుండు శ్రీరామచంద్రపరబ్రహ్మముంజూచి స్వామీ! పరబ్రహ్మమునకు నామరూపములు లేవని చెప్పుచున్నారే, (పరబ్రహ్మము) అనిచెప్పుటయే ఒకనామము గానున్నదే అనియడుగగా, వారిసూక్ష్మబుద్ధికి శ్రీరాములవారు సంతసించిఇట్లనిరి[శ్రుతి॥ఋతమాత్మాపరంబ్రహ్మ-సత్యమిత్యాదికా -బుధైః। కల్పితా-వ్యవహారార్థం-యస్య-సంజ్ఞా- మహాత్మనః॥]అనెడిమహోపనిషత్తురీతిగా-ఆంజనేయా పరబ్రహ్మమను నామము,మనోవాక్కులచే ఇట్టిదట్టిదని చెప్పుటకుశక్యమగు సృష్టికిలోబడినట్టి వస్తువునకు గలిగిననామము వంటిదిగాదు. అయితే లోకులకంటికి కనబడనట్టి దేవునికి బదులుగా ఒకవిగ్రహమునుచూపి దేవుడొక్కడున్నాడను జ్ఞప్తిని పుట్టించునట్లు, ఈప్రపంచసృష్టికి పూర్వము రూపనామములులేని నాశరహితమగువస్తువు ఒకటి తనకుతానే స్వతస్సిద్ధముగానుండెను అని, శిష్యునికి బోధించుటకుగాను ఆవస్తువునకు పరబ్రహ్మమను నామము, ఉపచారవార్తగా చెప్పబడినది సుమా.

శ్రుతి॥ సృష్టేఃపురా-నామరూప-వివర్జితం-జగత్॥

తాత్ప॥ సృష్టికిపూర్వము ఈజగత్తు నామరూపము లేనిదిగానుండెను.

శ్రుతి॥ సదేవ-సౌమ్య-ఇదమగ్ర-ఆసీత్॥ ఛాందోగ్యోపనిషత్తు.

తాత్ప॥ సృష్టికిమునుపు ఈప్రపంచము నామరూపములులేనిదై, కేవల నిర్విశేష చిన్మాత్ర పరబ్రహ్మముగానుండెను.

శ్రుతి॥ తస్మిన్-మరు-శుక్తికా-స్థాణు-స్ఫటికాదౌ-జలరౌప్య-పురుష-రేఖాదివత్। లోహిత-శుక్ల-కృష్ణమయీ-గుణసామ్యా-నిర్వాచ్యా-మూలప్రకృతి-రాసీత్॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ ఎండమావులందు జలము, శుక్తియందు రజతము, స్థాణువునందు పురుషుడు, స్ఫటికమునందు నానావిధ వర్ణములు లేకున్నను, భ్రమవలన ఉన్నట్లుతోచురీతిని శుద్ధనిర్గుణ నిరాకార నిర్వికార పర బ్రహ్మమునందు మూలప్రకృతియనెడు లేనిమాయ ఒకటిగలిగెను. ఆమూల ప్రకృతి, ఎరుపు నలుపు తెలుపు అను మూడువర్ణములతోడ మరల మూడురూపులుగలదై మూడుశక్తులాయెను. తెలుపువర్ణము మాయాశక్తి, ఎఱ్ఱవర్ణము అవిద్యాశక్తి, నల్లవర్ణము ఆవరణవిక్షేపశక్తులనబడును.

శ్రుతి॥ సత్త్వోద్రిక్తా-వ్యక్తావరణ-శక్తిరాసీత్। తత్-ప్రతిబింబం-యత్-తదీశ్వర-చైతన్యమాసీత్। సస్వాధీన-మాయ-స్సర్వజ్ఞః। సృష్టి-స్థితి-లయానా-మాదికర్తా-జగదంకుర-రూపో-భవతి॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ మాయాశక్తి సత్త్వగుణప్రధానగానుండును. దానియందు పరబ్రహ్మము ప్రతిబింబించుటవలన గలిగిన ప్రతిబింబమే ఈశ్వరుడనబడును. ఇతడు ఆమాయను స్వాధీనముచేసుకొని బ్రహ్మవిష్ణుమహేశ్వరరూపములతోడ ప్రపంచమును సృష్టి స్థితి సంహారములుచేయుచుండును.

శ్రుతి॥ బ్రహ్మణో-రవ్యక్తః-అవ్యక్తాత్-మహాత్-మహతోహంకారః-అహంకారాత్-పంచతన్మాత్రాణి-పంచతన్మాత్రేభ్యో-పంచమహాభూతాని-పంచమహా-భూతేభ్యోఖిలం-జగత్॥ త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్.

తాత్ప॥ బ్రహ్మమునుండి మాయ, మాయవలన అవ్యక్తము, దానివ

లన అహంకారము అనబడు ఆవరణ విక్షేపశక్తులు; దానినుండి శబ్దస్పర్శ రూప రసగంధములనెడు పంచతన్మాత్రలు, వానివలన సూక్ష్మములైన ఆకాశ వాయు అగ్ని జల పృథివి అనెడు పంచభూతములును, దానివలన స్థూలములైన ఆకాశాది పంచభూతములు, ఆపంచభూతముల వలన ప్రపంచము బుట్టెను. మాయవలనగలిగిన ప్రపంచము మాయాశక్తి లయించిపోవునప్పుడు దానితోడ లయించిపోవును, మరల ఆమాయాశక్తి తోచునప్పుడు దానితోడ ప్రపంచము మరల కలుగుచుండును ఇట్లు పలుమార్లు మాయాశక్తి తోచితోచి లయించుచుండునట్లు, ప్రపంచమున్ను పలుమార్లు తోచితోచి లయించుచుండును. కారణము వి

అపవాదయుక్తి.

నా కార్యములేదనియు, కారణమే కార్యముగా తోచుచున్నదనియు, చెప్పుట అపవాదయుక్తి యనబడును. ఎట్లనగా కారణమగు మట్టియే నానావిధ నామరూపములతో వేరువేరువస్తువులుగా కుండలుచట్లుగా తోచుచున్నదిగాని, సూక్ష్మబుద్ధిని విచారించిచూడగా మట్టినివినా కుండలుచట్లు వేరుగాలేదని యెరుంగుట అపవాదయుక్తి అనబడును.

శ్రుతి॥ బ్రహ్మాద్యం-స్థావరాంతం-పశ్యంతి-జ్ఞానచక్షుషా। తమేకమేవ-పశ్యంతి-పరిశుద్ధం-విభుం-ద్విజాః। యస్మిన్-భావాః-ప్రలీయంతే-లీనాశ్చావ్యక్తతాం-యయుః। పశ్యంతి-వ్యక్తతాం-భూయో-జాయంతే-బుద్బుధాఇవ॥సుబాలోపనిషత్తు.

తాత్ప॥ ఆంజనేయా! సకలనదులున్ను సాగరంబులోబడి కలిసి భేధములేక ఏకమైపోవునట్లు బ్రహ్మాదిస్థావరపర్యంత సకలచరాచర జగత్తు ఏపరబ్రహ్మమునందుండి కలిగెనో,ఆపరబ్రహ్మమునందేమరల ప్రళయంబున లయించిపోవును, మరల సముద్రమునందు అలలు బుగ్గలు భుట్టునట్లు, ఆపరబ్రహ్మమునందుండియే సకలచరాచర జగత్తు పుట్టుచుండును. కాబట్టి సముద్రజలమే అలలు బుగ్గలుగా తోచునట్లు, పరబ్రహ్మమొక్కటియే ఈప్రకారము నానావిధ రూపనామములతోడ సకలచరాచర జగత్తుగాతోచుచుండునేగాని,బ్రహ్మమునకంటె ప్రపంచము

వేరుగాలేదనుచు, జ్ఞానులు ప్రపంచము సర్వమును బ్రహ్మముగా భావిం తురు. ఏతే,అలలు బుగ్గలు ఎన్నిమార్లు నానారూపములుగా తోచుచు మరల రూపులేక లయించుచున్నను సముద్రజలముమాత్రము ఏవికార ములులేక ఒక్కరీతిగానేయుండునట్లు,బ్రహ్మాది సకల ప్రపంచము నా నారూపములతో తోచుచుమరల నామరూపములు లేకలయించుచున్న ను,బ్రహ్మముమాత్రము ఏవికారములేక ఏకరీతిగా సత్యముగానుండును.

## వేదాంతవిచారణ.

శ్లో॥ నానాశాస్త్ర-పరేలోకే-నానాదేవంచ-పూజనం। ఆత్మజ్ఞానం వినా-పార్థ - సర్వకర్మ-నిరర్థకం ॥ ఆచారక్రియతే-కోటిదానంచ-గిరి కాంచనం-ఆత్మతత్వంవినా-నాస్తి-ముక్తిర్నాస్తి-గురుర్వినా॥ కోటియ జ్ఞం-కృతం-ఏన-కోటిగోహాయ-దానకం-గజదానం-సహస్రంచ- ముక్తిః జ్ఞానంవినా-నచ॥ గర్భగీతలు.

తాత్ప॥ ఓ ఆంజనేయా! సకలశాస్త్రములు చదివి పండితుడని పే రెత్తినప్పటికిన్ని, బ్రహ్మవిష్ణుమహేశ్వరాది సకలదేవతలను పూజిం చినప్పటికిన్ని ఆత్మజ్ఞానములేనియెడల పైజెప్పినవన్నియు నిష్ప్రయోజ నములే, వర్ణాశ్రమాచారములను తప్పక నడుచుకొన్నను, మేరుపర్వత మంతబంగారు కోటిసాయలు దానమిచ్చినను, ఆత్మజ్ఞానములేకున్న యెడల నిష్ఫలంబే. కోటియజ్ఞములు చేసినప్పటికిన్ని, గోవులు గుఱ్ఱము లు ఏనుగులు కోట్లుకోట్లుగా దానమిచ్చినప్పటికిన్ని ముక్తిలేదు. గురుక టాక్షములేక ఆత్మజ్ఞానము లభింపదు. ఆత్మజ్ఞానములేక ముక్తిలభింపదు. శరీరమిట్టిదని శరీరలక్షణమును విచారించి తెలియనియెడల, ఆత్మ ఇట్టి దని ఆత్మజ్ఞానము కలుగజాలదు. కాబట్టి శరీర లక్షణమును ఇట్టిదని చెప్పుచున్నాను శ్రద్ధతోవినుమని యిట్లనియె.

## శరీరలక్షణము.

శ్రు। సాంఖ్యం-దేహవిచారణంచ॥ బ్రహ్మయామళము.

తాత్ప॥ దేహమిట్టిదనియు, దేహి ఇట్టివాడనియు, తెలియుట సాం

క్యవిచారణ అనబడును. (జ్ఞానేంద్రియంబులైదు, కర్మేంద్రియంబులైదు, పంచతన్మాత్రలు, పంచప్రాణములు, అంతఃకరణ చతుష్టయము, మొత్తం ౨౪-తత్వములుగూడినదే శరీరము. ఇందు వసించు ఆత్మ, దేహి. ఇతడే ౨౫-వ-తత్వము)—(1) శ్రోత్రేంద్రియము అనగా చెవులు. ఇది నానా విధ శబ్దములను వినుచుండును. (2) త్వగింద్రియము అనగా దేహచర్మము. ఇది శీతం ఉష్ణం మృదువు కఠినం అను నాలుగువిధములగు స్పర్శములను ఎరుగుచుండును. (3) చక్షురింద్రియము అనగా నేత్రములు. ఇది తెలుపు నలుపు ఎరుపు పచ్చ మిశ్రవర్ణము పొడుగు పొట్టి లావు సన్నము అనెడి పదిరూపంబులను ఎరుగుచుండును. (4) జిహ్వేంద్రియము అనగా నాలుక, ఇది ఉప్పు పులుసు తీపు చేదు కారము వగరు అనెడి ఆరురసములను ఎరుగుచుండును. (5) ఘ్రాణేంద్రియము అనగా ముక్కు. ఇది సుగంధ దుర్గంధములను ఎరుగుచుండును. ఈ అయిదు ఇంద్రియంబులున్ను ఒక్కొక్కటిన్ని ఒక్కొక్క విషయమును ఎరుగుచుండుటవలన, వీనిని జ్ఞానేంద్రియంబులనబబడును.—(1) వాగింద్రియము అనగా నోరు. ఇది మాట్లాడుచుండును. (2) పాణీంద్రియము అనగా చేతులు. ఇది ఇచ్చుట పుచ్చుకొనుట మొదలగు కార్యములను చేయును. (3) పాదేంద్రియము అనగా కాళ్లు. ఇది నడుచుట కూర్చుండుట నిలుచుట లేచుట ఆడుట మొదలగుకార్యములను చేయుచుండును. (4) గుహ్యేంద్రియము అనగా స్త్రీ)పురుషులయొక్క మర్మస్థానము. ఇది మూత్రమువిడుచుట శుక్లశోణితముల విడుచుట సంభోగించుట మొదలగుకార్యములను చేయును. (5) పాయురింద్రియము అనగా గుదము, ఇది మలవిసర్జనముచేయును. ఈ అయిదున్ను ఒక్కొక్కటిన్ని ఒక్కొక్క కార్యమును చేయుచుండుటవలన కర్మేంద్రియంబులనబడును.—(1) మనస్సు, ఇది సంకల్పవికల్పములను చేయుచుండును. ఒకటిని తలచుట మరల మరచుట, ఇవియే సంకల్ప వికల్పములు. (2) బుద్ధి, ఇది కార్యాకార్యముల చేయుటకై నిశ్చయించుచుండును. (3) చిత్తము, ఇది శరీరేంద్రియములకు చలనముగలిగించి ఆయా యింద్రియ

ములుగుండా వానివాని కార్యములు చేయించును. (4) అహంకారము, ఇది కార్యాకార్యములందు యోచనచేయుటనుమాని అహంభావము చేత, నేను నేను అని అహంకరించి పుణ్యపాపకార్యములు చేయుచుం డును.— ఈ నాలుగున్ను శరీరములోపల ఉండుకొని శరీరముబయట నుండు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను వానివాని వృత్తులయందు ప్రవే శింపచేయుచున్నవిగాన అంతరింద్రియము లనబడును — (1) ప్రాణ వాయువు, ఇది హృదయస్థానమంగుండుకొని ముక్కురంధ్రములగుండా ఉచ్ఛ్వాస నిశ్వాసములుగా సంచరించుచు అన్నమును జీర్ణముచేయిం చును. (2) అపానవాయువు, ఇది గుదస్థానమందుండుకొని మలమూ త్రములు బయటికి త్రోసి మరల గుదద్వారమును బిగించుచుండును. (3) ఉదానవాయువు, ఇది కంఠస్థానమందుండుచు అన్నమును మ్రింగు నట్లు కక్కునట్లుచేసి, అన్నరసము నరములకు వ్యాపింపజేయును. (4) వ్యానవాయువు, ఇది దేహమునందు సర్వసంధులందుండుకొని మనము భుజించు అన్నమును పిప్పి వేరు రసము వేరుగా చేయుచుండును. మరి యు దేహమునకు స్పర్శమును ఎరిగించును. (5) సమానవాయువు, ఇది నాభిస్థానమందుండుకొని ఆకలిదప్పులు పుట్టించుచు అన్నరసమును ర క్తరూపముగా సకల రోమములకున్ను నాళ్లకున్ను సమముగా వ్యాపిం చునట్లు చేయును. ఈ అయిదున్ను ఈదేహమందుండుటవల్లనే ఒకడు జీవించుచున్నాడు గాన వీనిని పంచప్రాణములనబడును.— (1) శబ్దము, ఇది ఆకాశముయొక్క తన్మాత్ర. కర్ణములందు బోలుగా ఆకాశముం డుటవలన, అక్కడ ఆకాశతన్మాత్రయగు శబ్దము పుట్టుచుండును. (2) స్పర్శము, ఇది వాయువుయొక్క తన్మాత్ర. దేహచర్మమునందు సర్వత్ర వాయువు వ్యాపించియుండుటవలన, స్పర్శగుణమును శరీరము ఎరుగు చుండును. (3) రూపము, ఇది అగ్నియొక్క తన్మాత్ర. నేత్రేంద్రియమున అగ్ని సంబంధించియుండుటవలన దశవిధ రూపములను నేత్రము ఎరు గుచుండును. (4) రసము, ఇది జలతన్మాత్ర. నాలుకయందు జలము సంబంధించియుండుటవలన నాలుక ఆరు రసములను ఎరుగుచుండును.

(5) గంధము, ఇది పృథివియొక్క తన్మాత్ర. ముక్కునందు పృథివిసంబంధముండుటవలన సుగంధదుర్గంధముల ముక్కు ఎరుగుచుండును. ఈ -౨౪-తత్త్వములున్ను ఆత్మను ఎరుగజాలవు, కాబట్టి జడములనబడును. ఆత్మ, జ్ఞానస్వరూపుడగుటవలన చిత్తు అనబడును. ఇట్లు -౨౪-తత్త్వములతోగూడిన యీశరీరము మూడువిధములు. ఎట్లనగా.

## శరీరత్రయము.

స్థూల సూక్ష్మ కారణములని శరీరములు మూడువిధములు. కాలు చేతులు, తల, కన్ను, ముక్కు, మొదలగు అవయవములతోగూడిన ఈ మాంసశరీరము చేతితో బట్టుటకు కఠినముగా మృదువుగా పొడుగుగా పొట్టిగా లావుగా సన్నముగాతోచుటవలన ఇది స్థూలశరీరమనబడును. జ్ఞానేంద్రియంబులైదు కర్మేంద్రియములైదు పంచప్రాణములు మనస్సు బుద్ధి అనెడి-౧౭-అవయవములతోగూడినదే సూక్ష్మశరీరము, లేక లింగశరీరమనబడును. కంటికి తెలియక, చేతులతో పట్టుటకు సాధ్యపడక, ఈ స్థూలశరీరములోపల నుండునదే సూక్ష్మశరీరము. అజ్ఞానమే కారణశరీరము. (శీర్యతే-శరీరం) జీర్ణించిపోవునదిగనుక వీనిని శరీరములనియు, (దహ్యతే-దేహః) దహింపబడుచున్నవిగాన దేహములనియు చెప్పబడును. (1) అన్నములేకుంటే స్థూలశరీరము జీర్ణించిపోవును, మరియు వ్యాధులవలన జీర్ణించిపోవును, మరియు ముసలితనమున జీర్ణించిపోవును. ఇదిగాక ప్రాణమువెళ్లిన తర్వాత ఈస్థూలశరీరము శ్మశానాగ్నిలో దహించిపోవును, లేకుంటే తాపత్రయములనెడు దుఃఖాగ్నిలో దహించిపోవును.—(2) రాగ ద్వేష కామ క్రోధములు నానాట విశేషించుటచేత సూక్ష్మశరీరము వృద్ధిజెందును. ఈరాగద్వేషాదులు నానాట తగ్గిపోవుటచేత సూక్ష్మశరీరము జీర్ణించిపోవును. ఈరాగద్వేషాదులు సూక్ష్మశరీరవికారములు. (3) అజ్ఞానమువలన నేను నాదియనెడు అభిమానము నానాట విశేషించుటవలన కారణశరీరము వృద్ధిబొందును. అభిమానము నానాట ఉడుగుటవలన కారణశరీరము జీర్ణించును. సూక్ష్మ

కారణశరీరములు రెండున్ను జ్ఞానాగ్నిచేత రూపులేకదహించిపోవును. ఐతే మాంసమయమగు స్థూలశరీరము ప్రత్యక్షముగా నబడుచున్నది, సూక్ష్మశరీరము కనబడుటలేదు. కాబట్టి అది ఉన్నదని ఎట్లు చెప్పవచ్చుననగా, నిద్ర మరణము మూర్ఛలు సంభవించు సమయమున స్థూలశరీరమునందు, నేత్రములు కర్ణములు మొదలగు ఇంద్రియములుండినప్పటికిన్ని ఆనేత్రములు చూచుటలేదు, ఆకర్ణములు వినుటలేదు, ఇట్లు ఒక్కొక్క ఇంద్రియమున్ను దానిదాని కార్యములు చేయుటలేదు. కాబట్టి స్థూలశరీరము సకలకార్యములు చేయుచున్నదని చెప్పగూడదు. ఈస్థూలశరీరములోపల సూక్ష్మశరీరము ఒకటి ఉండియే సమస్తకార్యములను చేయుచున్నది,ఐతే ఈసూక్ష్మశరీరము తనంతట కార్యములను చేయుటలేదు, అగ్ని కట్టెలందువ్యాపించి సకలము భస్మముచేయునట్లు సూక్ష్మశరీరము స్థూలశరీరమునందు వ్యాపించి సకలకార్యములను చేయుచున్నది. అగ్నిలేనికట్టెలు ఏప్రకారము ఒకపదార్థమును దహించజాలదో అట్లు సూక్ష్మశరీరము వెళ్లిపోయినవెనుక స్థూలశరీరము ఏకార్యమునున్ను చేయజాలదు. కాబట్టి స్థూలశరీరముకంటెను వేరుగా దీనిలోపల సూక్ష్మశరీర మొకటి యున్నదిసుమా, స్థూలశరీరమందుండు నేత్రములందు సూక్ష్మమగు నేత్రేంద్రియముండుటవల్లనే, స్థూలశరీర నేత్రములు సర్వమును చూచుచుండును ఆసూక్ష్మనేత్రేంద్రియము లేనియెడల ఈస్థూలశరీరనేత్రములు దేనిన్ని చూడజాలదు. స్థూలశరీరమందుండు కర్ణములందు సూక్ష్మమగు కర్ణేంద్రియము ఒకటియుండుటవల్లనే స్థూలశరీరకర్ణములు సకలశబ్దములను వినుచుండును, ఆసూక్ష్మమగు కర్ణేంద్రియము లేనియెడల స్థూలశరీర కర్ణములు శబ్దములను వినజాలదు, ఈప్రకారము ఒక్కొక్క సూక్ష్మేంద్రియము వ్యాపించియుండుటవల్లనే స్థూలశరీరమునందలి సర్వేంద్రియములు తమతమకార్యములను చేయుచుండును. సూక్ష్మేంద్రియములు లేనియెడల స్థూలశరీరమునందలి ఇంద్రియములు ఏకార్యములను చేయచాలదు సుమా? కాబట్టి ఈస్థూలశరీరముకంటెను వేరుగా దీ

నిలోపల సూక్ష్మశరీరమొకటి యున్నది సుమా. ఈస్థూల సూక్ష్మము లురెండున్ను కార్యరూపములుగానున్నది. పొగవచ్చుటచే అగ్నిని చూడకున్నను కారణమగు అగ్ని ఉండినందువల్లనే దానికార్యమగు పొగ వచ్చు చున్నదని నిశ్చయించునట్లు, కార్యరూపములగు స్థూల సూక్ష్మ శరీరములు కలుగుటకు కారణమొకటి కలదని నిశ్చయింప వచ్చును. అదే అజ్ఞానస్వరూపమగు కారణశరీరము. నేను అజ్ఞానిని అనుటవలన అజ్ఞానమూ ప్రత్యక్షముగానున్నది సుమా. ఆయజ్ఞాన మే కారణశరీర మనబడును, దానివల్లనే స్థూలసూక్ష్మ శరీరములుగలుగుచు, జననమరణములు గలుగుచుండును. ఎట్లనగా [శ్లో॥ అజ్ఞానా-దవివేకః। అవివేకా-దభిమానః। అభిమానా-ద్రాగాదయః। రాగాదయం - కర్మాణి। కర్మణా- శరీర-పరిగ్రహః॥] అజ్ఞానమువలన అవివేకము, అవివేకమువలన నేనునాదియనెడి అభిమానము, అభిమానమువలన కామక్రోధాదులు, కామక్రోధాదులవలన అనేక కర్మములుచేయుచు, కర్మవశమున ఈజీవాత్మ జననమరణములను బొందుచు మరల పూర్వకర్మవశమున బుట్టుచుచచ్చుచు ఇట్లు అనేకజన్మములెత్తుచు దుఃఖించు చుండును, కాబట్టి కారణశరీరము నశించకుండినను ముక్తిలేదు. [శ్రుతి॥ తదా- విద్వాన్-బ్రహ్మజ్ఞానాగ్నినా-కర్మబంధం-నిర్దహేత్ ॥] అనెడి పైంగలోపనిషత్తురీతిగా, బ్రహ్మజ్ఞానాగ్నివలన అజ్ఞానమున్ను సకలకర్మములున్ను నశించి జీవుడు ముక్తిబొందును.—అని చెప్పగా అంజనేయుండు శ్రీరామచంద్రునిం జూచి స్వామీ జ్ఞానమనగానేమి అజ్ఞానమనగానేమి అని యడుగగా శ్రీరామచంద్రుండు చెప్పనారంభించెను.

## జ్ఞా నా జ్ఞా న ము లు.

---

శ్రుతి॥ చైతన్యందినా-కించిన్నాస్తీతి-సాక్షాత్కారానుభవః-జ్ఞానం। నానాత్మ-భేదకల్పితం-జ్ఞాన-మజ్ఞానం॥-నిరాలంబోపనిషత్తు.

తాత్ప॥ దేహత్రయమునకు వేరై సాక్షిగానుండు ఆత్మయే తానని యూ, తనవల్ల ఎరుగబడిన దేహేంద్రియాది నానావిధ నామరూప ప్ర

పంచంబు దృశ్యంబులనియు జడమ్ములనియు, సర్వప్రపంచంబును ఎరుగుచుండెడు జ్ఞానానందమయుండగు తాను దృక్కు అనియు, మరియు సముద్రజలమునందు బుట్టిన తరంగంబులు ఆసముద్రజలంబునకంటెను వేరుగాలేనట్లు, ప్రపంచంబు సర్వంబును తనయందు కల్పితంబులగుటవలన తనకంటెవేరుగాలేదనియు, అయినను కల్పితంబులగుటవలన రజ్జుసర్పంబురీతిని ప్రపంచంబు అసత్యంబనియు, ఆత్మస్వరూపుడగు తాను సత్యజ్ఞానానంద పరబ్రహ్మమనియు, ఎరింగి సకలసందేహములుమాని, నిష్కాముండై ఆత్మధ్యానపరుండై, నిర్వికల్పుండై ఏతలంపులులేక సకలదృశ్యములుమఱచి, కేవలసాక్షిమాత్రుడై ఆనందించుచుండుటే జ్ఞానమనబడును. అట్లు ఆత్మస్వరూపుడగు తానే పరబ్రహ్మమని తెలియక, దేహమే తాననితలంచి దేహాభిమానముగలవాడై, సకలచరాచర ప్రపంచంబును తనకంటెను వేరుగాభావించి, కామక్రోధ ఈర్ష్య అసూయాది దుర్గుణములు కలవాడై, జీవహింస వ్యభిచారాది పాపకార్యములు చేయుచు, దారాపుత్రాదులనెడి ఈషణత్రయ వలలోబడగులుకొని తాపత్రయముచే దుఃఖించుచు, తనకు జననమరణములు గలదని భ్రమించుచుండుటే అజ్ఞానము. దీనివలన జననమరణములు తప్పక గలుగునుసుమా. ఓ ఆంజనేయా! [శ్రుతి॥ ఆత్మావా-అరే-ద్రష్టవ్య- శ్రోతవ్యో-మంతవ్యో-నిధిధ్యాసితవ్యః॥] అనెడి బృహదారణ్యోపనిషత్తురీతిని ఆత్మలక్షణమిట్టిదని సదా శ్రవణ మనన నిధిధ్యాసనాదులను చేయుటవలన, అజ్ఞాన విపరీత సంశయంబులు నివర్తించి, ముక్తిపొందవచ్చునుగాన, ఆత్మస్వరూపమిట్టిదని చెప్పుచున్నాను వినుమని యిట్లనియె.

## ఆ త్మ ల క్ష ణ ము.

---

శ్రుతి॥ అశరీరం-శరీరేషు। అనవస్థే-ష్వవస్థితం॥ కఠోపనిషత్తు.

తాత్ప॥ ఓ ఆజంనేయా! ఈశరీరమునందు ఆత్మ, తనకు శరీరములేక నాశరహితుడై వసించుచున్నాడు.

శ్రుతి॥ అథాయ-మశరీరో-మృతః॥ బృహదారణ్యోపనిషత్తు.

తాత్ప॥ ఈశరీరమునందుండు ఆత్మ, నాశములేనివాడు, తనకు శరీరములేనివాడు.

శ్రుతి॥ అయమాత్మా-బ్రహ్మ॥ బృహదారణ్యోపనిషత్తు.

తాత్ప॥ ఈదేహమునందు వసించు ఈఆత్మయే పరబ్రహ్మము.

శ్రుతి॥ అణోరణీయాన్-మహతో-మహీయాన్ । ఆత్మాస్య- జంతోర్నిహితో-గుహాయాం॥ కఠోపనిషత్తు.

తాత్ప॥ ఈలోకమున చీమలకంటెను మిక్కిలి సూక్ష్మమైన జంతువులయొక్కయు, ఏనుగవంటి లేక మహామేరుపర్వతమువంటి మిగుల గొప్పజంతువులయొక్కయు శరీరములందు ఆత్మ వసించుచుండును.

శ్రుతి॥ యదేవేహ-తదముత్ర-తదన్విహ । మృత-స్సమృత్యు - మాప్నోతి। య-ఇహ-నానేవ-పశ్యతి॥ కఠోపనిషత్తు.

తాత్ప॥ ఈలోకమున ఈశరీరమందుండు ఈఆత్మయే, అపరలోకమునందలి పరబ్రహ్మముగానున్నది. అపరలోకమునందలి పరబ్రహ్మమే, ఈలోకమునందు ఈశరీరంబునందు ఆత్మస్వరూపముగా నివసించియున్నది. ఒక్క ఆకాశమే ఘటోపాధివలన ఘటాకాశమనియు, ఉపాధిలేనియెడల మహాకాశమనియు చెప్పబడునట్లు, సర్వపరిపూర్ణమగు పరబ్రహ్మము ఈదేహమునందు వసించుటవలన దేహోపాధిచేత ఆత్మయనబడుచున్నది. కాబట్టి ఆత్మవేరు పరబ్రహ్మము వేరని భేదముగా దలంచువారు జననమరణ దుఃఖసాగరమునమునిగి దుఃఖించుచుందురు.

శ్రుతి॥ ఏకో-వశీ-సర్వభూతాంతరాత్మా। ఏకం-బీజం - బహుధా-యఃకరోతి॥ కఠోపనిషత్తు.

తాత్ప॥ సూక్ష్మమగు మఱ్ఱివిత్తనమునుండి అనేక కొమ్మలు రెమ్మలు పూలుపిందెలు కాయలుపండ్లు ఆకులు మొదలగువానితోడ గొప్ప వృక్షముగలిగినను, ఆవిత్తునందలి సత్తే ఆచెట్టంతయు వ్యాపించియుండునట్లు, పరబ్రహ్మమగు ఆత్మ తనవలనగలిగిన సకలచరాచర ప్రపంచమునంతటను తాను ఒక్కడే వ్యాపించియున్నాడు.

శ్రుతి॥ ఏకోదేవ - స్సర్వభూతేషు-గూఢ-స్సర్వవ్యాపీ - సర్వభూ

తాంతరాత్మా । కర్మాధ్యక్ష-స్సర్వభూతాధి- వాసస్సాక్షీ-చేతా-కేవలో-నిర్గుణశ్చ॥ శ్వేతాశ్వతరోపనిషత్తు.

తాత్ప॥ ఒకముత్యాల సరమునందుండెడి ఒక్కొక్క ముత్యమునందున్న దారము వ్యాపించియుండునట్లు, పరబ్రహ్మమగు ఆత్మ సకల జీవజంతువులందున్ను గూఢముగా వ్యాపించి ఆయాజీవులుచేయునట్టి కర్మలకు సాక్షిగానున్నాడు.

శ్రుతి॥ అగ్నిర్యథైకో-భువనం-ప్రవిష్టో- రూపంరూపం-ప్రతిరూపో-బభూవ । ఏకస్తథా-సర్వభూతాంతరాత్మా-రూపంరూపం-ప్రతిరూపో-బహిశ్చ॥ కఠోపనిషత్తు.

తాత్ప॥ ఒకవత్తియందు వెలుగుచుండెడు దీపమునుండి అనేకవత్తులు వెలిగించినప్పుడు, ఆ ఒక్క దీపమే ఆవత్తులందు వ్యాపించి అనేక దీపములుగా దోచునట్లు, ఒక్క ఆత్మయే అనేకదేహములందు వ్యాపించి అనేక ఆత్మలుగా దోచుచున్నాడు.

శ్రుతి॥ వాయుర్యథైకో-భువనం-ప్రవిష్టో। రూపంరూపం-ప్రతిరూపో-బభూవ। ఏకస్తథా-సర్వభూతాంతరాత్మా । రూపంరూపం-ప్రతిరూపో-బహిశ్చ॥ కఠోపనిషత్తు.

తాత్ప॥ ఒక్కవాయువే ప్రపంచమందంతట వ్యాపించి మలయమారుతమనియు ప్రాణవాయువనియు సుడిగాలియనియు నానావిధములుగా దోచునట్లు, ఒక్క ఆత్మయే పిపీలికాది బ్రహ్మపర్యంత సకలశరీరములందు వ్యాపించి అనేక ఆత్మలుగా దోచుచుండును.

శ్రుతి॥ తదేతత్-బ్రహ్మ-పూర్వమనపర -మనంతర-మబాహ్యం॥ బృహదారణ్యోపనిషత్తు.

తాత్ప॥ ఈప్రపంచంబున ముందు వెనుక కుడిదిక్కున ఎడమదిక్కున లోపల వెలుపల క్రింద మీద సర్వత్ర పరిపూర్ణముగా ఆత్మనిండియున్నాడు.

శ్రుతి॥ సవా-ఏష-మహానజ-ఆత్మాజరో-మరో-మృతో-భయో-బ్రహ్మాభయం-హి-వై । బ్రహ్మభవతి॥ బృహదారణ్యోపనిషత్తు.

తాత్ప॥ ఈశరీరమునకే బాల్యయౌవన కౌమార వార్ధ అవస్థలు గలదుగాని, ఆత్మ పుట్టుకలేనివాడు, బాల్యయౌవన మార వార్ధిక్యములు లేనివాడు. మరణములేనివాడు, నాశములేని వాడు, భయములేనివాడు, ఇతడే పరబ్రహ్మము.

శ్రుతి॥ నజాయతే-మ్రియతేవా-విపశ్చి - న్నాయం । కుతశ్చిన్న బభూవ-కశ్చిత్ । అజో-నిత్యో - శాశ్వతోయం-పురాణో-నహన్యతే-హన్యమానే-శరీరే॥ కఠోపనిషత్తు.

తాత్ప॥ ఈ ఆత్మ చావుపుట్టుకలు లేనివాడు. ఇతడే సర్వసాక్షి. ఈ ఆత్మ ఒకరివలన పుట్టబడినవాడుకాడు. ఒకరివలన చంపబడువాడు కాడు. పునర్జన్మములులేనివాడు, నిత్యమైనవాడు, శాశ్వతుడు, ఆదిమ ధ్యాంతములులేనివాడు. ఈ శరీరము నశించిపోవును, ఆత్మ ఎప్పటికిని నాశములేనివాడు.

శ్రుతి॥ హంతాచేన్మన్యతే-హంతుం। హతశ్చేన్మన్యతే-హతం।ఉభౌ తౌ-నవిజానీతో। నాయంహంతి-నహన్యతే॥ కఠోపనిషత్తు.

తాత్ప॥ చావుపుట్టుకలులేని పరబ్రహ్మమగు ఈఆత్మ ఒకరిచేత చంపబడడు, తానున్ను ఒకరిని చంపడు. ఎందువల్లననగా కాళ్లు చేతులు మొదలగు అవయవములు లేనివాడుగనుక ఒకరిని చంపజాలడు, రూప నామములు లేనివాడుగనుక తానున్ను ఒకరిచేత చంపబడడు,మూఢులు మాత్రము ఆత్మ చచ్చుచున్నాడనియు పుట్టుచున్నాడనియు తలంతురు.

## ఆత్మకు చిత్తు లక్షణము.

---

శ్రుతి॥కతమ-ఆత్మేతి-యోయం-విజ్ఞానమయః॥బృహదారణ్యోపనిషత్తు

తాత్ప॥ ఆత్మ ఎట్టిదనగా సకలజీవజంతువుల హృదయంబున ఏది వసించుచు (అహం అహం) నేను నేను అనుచును, నాకన్ను నాముక్కు నా చెవులు నాఘనము నాశరీరము నాభార్య నాబిడ్డలు అనుచును, దేహాది ప్రపంచము సర్వమును ఎరుగుచున్నదో, అజ్ఞానస్వరూపమగు వస్తువే ఆత్మ, లేక చిత్తు అనబడును. చిత్తు అనగా జ్ఞానస్వరూపుడనుట.

శ్రుతి॥ యేన-రూపం-రసం-గంధం-శబ్దాన్-స్పర్శాంశ్చ-మైథునాన్। ఏతేనైవ-విజానాతి-కిమత్ర-పరిశిష్యతే-ఏతద్వై-తత్॥ కఠోపనిషత్తు.

తాత్ప॥ ఈశరీరమందు ఏది ఉండుచు నేత్రములద్వారా సకలరూపములను, నాసికద్వారా గంధమును, నాలుకద్వారా రుచులను, కర్ణములద్వారా శబ్దములను, చర్మముద్వారా స్పర్శమును, ఉపస్థద్వారా సంభోగసుఖమును, ఎరుగుచున్నదో, ఆజ్ఞానస్వరూపమగు వస్తువే ఆత్మ.

శ్రుతి॥ యస్సర్వేషు-భూతేషు-తిష్ఠన్-సర్వేభ్యో-భూతేభ్యోంతరోయం। సర్వాణి-భూతాని-నవిదుః। బృహదారణ్యోపనిషత్తు.

తాత్ప॥ ఏది సకలభూతములందు వ్యాపించియున్నను ఆభూతముల వలన దానినెరుగుటకు సాధ్యపడదో ఆజ్ఞానస్వరూపమగు వస్తువే ఆత్మ. అనగా పంచభూతములకు ఒకటినియొరిగెడు జ్ఞానము లేనందున అవి జడములు, జ్ఞానస్వరూపుడగుచు సర్వము నెరుగు ఆత్మ చిత్తు అనబడును.

శ్రుతి॥ యః ప్రాణే-తిష్ఠన్-ప్రాణాదంతరోయం ప్రాణో-నవేద। యో వాచితిష్ఠన్-వాచోంతరోయం-వాఙ్న వేద। యశ్చక్షుషి-తిష్ఠన్-చక్షురంతరోయం-చక్షుర్న వేద। ఇత్యాది॥ బృహదారణ్యోపనిషత్తు.

తాత్ప॥ ఒక గదియందుండు దీపముయొక్క ప్రకాశము ఆగదియంతయు నిండియుండునట్లు, ఈశరీరంబున జ్ఞానజ్యోతియగు ఆత్మ నివసించియుండుటవలన దానిప్రకాశము దేహేంద్రియంబులందు అంతట వ్యాపించియుండును. ఏఆత్మప్రకాశము ప్రాణవాయువునందు వ్యాపించియుండుటవలన, ఆప్రాణవాయువు ముక్కురంధ్రములగుండా ఉచ్ఛ్వాస నిశ్వాసములుగా తిరుగుచుండునో, ఆయాత్మ ప్రాణవాయువుకంటెను వేరుగానున్నది. జ్ఞానస్వరూపమగు ఆత్మను జ్ఞానములేనట్టి జడమగు ప్రాణవాయువు ఎరుగజాలదు. ఆత్మప్రకాశము వాక్కునందు వ్యాపించియుండుటవలన వాక్కు మాట్లాడుచుండును. ఆత్మ వాక్కుకంటెను వేరుగానున్నది. జ్ఞానస్వరూపమగు ఆత్మను జ్ఞానములేని వాగింద్రియము ఎరుగజాలదు. ఆత్మప్రకాశము నేత్రములందు వ్యాపించుటవలన నేత్రములు సకల రూపములను జూచుచుండును, అయితే

ఆత్మ నేత్రములకంటె వేరుగానున్నది. జ్ఞానస్వరూపమగు ఆత్మను జ్ఞానములేనట్టి నేత్రములు ఎరుగజాలదు. ఆత్మప్రకాశము కర్ణములందు వ్యాపించుటవలన కర్ణములు శబ్దములను వినుచుండును. అయితే ఆత్మ కర్ణములకంటెను వేరుగానున్నది. జ్ఞానస్వరూపమగు ఆత్మను జ్ఞానములేనట్టి కర్ణములు ఎరుగజాలవు. ఆత్మప్రకాశము మనస్సునందు వ్యాపించియుండుటవలన మనస్సు సంకల్పవికల్పములు చేయుచుండును. అయితే ఆత్మ మనస్సుకంటెను వేరుగానున్నది. జ్ఞానస్వరూపమగు ఆత్మను జ్ఞానములేనట్టి మనస్సు ఎరుగజాలదు ఆత్మప్రకాశము దేహచర్మమునందు వ్యాపించియుండుటవల్లనే చర్మము స్పర్శమునెరుగుచుండును. అయితే ఆత్మ దేహచర్మమునకంటెను వేరుగానున్నది. జ్ఞానస్వరూపమగు ఆత్మను జ్ఞానములేనట్టి చర్మము ఎరుగజాలదు. ఆత్మప్రకాశము బుద్ధియందు వ్యాపించియుండుటవలన బుద్ధి సకలకార్యములను నిశ్చయించుచుండును. అయితే ఆత్మ బుద్ధికంటెను వేరుగానున్నది. జ్ఞానస్వరూపమగు ఆత్మను జ్ఞానములేనట్టి జడమగు బుద్ధి ఎరుగజాలదు. ఆత్మప్రకాశము శుక్లమునందు వ్యాపించుటవలన శుక్లము పిండోత్పత్తిని చేయుచుండును. ఐతే ఆత్మ శుక్లముకంటెను వేరుగానున్నది. జ్ఞానస్వరూపమగు ఆత్మను జ్ఞానములేనట్టి జడమగు శుక్లము ఎరుగజాలదు.

శ్రుతి॥ ఏనేదం-సర్వం-విజానాతి-తం-కేన-విజానీయాత్ । విజ్ఞాతారమరే-కేన-విజానీయాత్॥ బృహదారణ్యోపనిషత్తు.

తాత్ప॥ ఈశరీరమునందు జ్ఞానస్వరూపమగు ఆత్మ వసించుటవల్లనే లోకమునందలి సకలజనులు నానావిధ నామరూపములతోడి ప్రపంచమును ఎరిగి చూచుచున్నారు. ఇట్టి జ్ఞానస్వరూపమగు ఆత్మను ఇట్టిదని ఎరుగుటకు మరియొక జ్ఞానస్వరూపమగు వస్తువు ఉన్నదనుట అసత్యమే. అనగా ఆత్మయే పరబ్రహ్మమనియు, దానికంటెను శ్రేష్ఠమైన వస్తువు మరియొకటి లేదనియు అభిప్రాయము.

## ఆత్మకు సత్తు లక్షణము.

శ్రుతి॥ స్వప్నాంతం-జాగరితాంతం-చోభౌ - యేనానుపశ్యతి । మహాంతం-విభుమాత్మానం-మత్వాధీరో - నశోచతి॥ కఠోపనిషత్తు.

తాత్ప॥ లోకమునందు ఒకానొకడు తనశరీరమునందు ఆత్మ వసించుచుండుటవల్లనే జాగ్రత స్వప్నములందలి నానావిధ నామరూప జగత్తును ఎరిగి చూచుచున్నాడు. మరల నిద్రయందు గాఢాంధకారమును ఎరిగి, మరల మేలుకొన్నతోడనే వాడు నేను సుఖముగా నిద్రించితి ననియు నిద్రయందు ప్రపంచము భ్రాంతిగా కనబడలేదనియు, ఐతే నిద్ర చీకటిగానుండెననియు ఎరిగి చెప్పుచున్నాడు, ఇట్లు జాగ్రతస్వప్న సుషుప్తి అనెడి మూడవస్థలందును జ్ఞానస్వరూపుడగు ఆత్మ సత్యముగా నాశములేక సాక్షిగానుండినందువల్లనే ఆయా అవస్థలు ఇట్టివని ఎరిగి చెప్పుచున్నాడుగాని లేకున్న చెప్పజాలడు. సత్తు అనగా త్రికాలములందును నాశములేక ఉండునది. ఆత్మ మూడవస్థలందును నాశరహితుడై ఉండుటవల్లనే జాగ్రతావస్థయందు కనబడు ప్రపంచము స్వప్నావస్థయందు కనబడలేదనియు, స్వప్నమునందు కనబడు ప్రపంచమున్ను దానియందలి వ్యాపారములున్ను జాగ్రతావస్థయందు కనబడలేదనియు, మరియు ఈరెండవస్థలందు కనబడు ప్రపంచములున్ను దానియందలి వ్యాపారములున్ను నిద్రయందు భ్రాంతిగా కనబడక శూన్యముగా గాఢాంధకారముగానున్నదనియు,ఎరిగిచెప్పుచున్నాడు గాన, ఆత్మ త్రికాలములందును నాశములేనివాడగుచు, సత్తు అనబడుచున్నాడు. ఒక అవస్థయందు కనబడు ప్రపంచము మరియొక అవస్థయందు కనబడకపోవుటచేత ప్రపంచము అసత్తు అనబడును.

## ఆత్మకు ఆనంద లక్షణము.

---

శ్రుతి॥ తదేతత్-ప్రేయః-పుత్రాత్-ప్రేయో విత్తాత్-ప్రేయో। ఆత్మానమేవ-ప్రియముపాసీత॥ బృహదారణ్యోపనిషత్తు.

తాత్ప॥ ఓ ఆజంనేయా! లోకమునందు ఆనందమే ఎల్లవారికి ప్రియముగానుండునుగాని, దుఃఖము అప్రియముగానుండును. మరియు ఆనందముగానుండునట్టిది దానితోగూడినవారికిన్ని ఆనందమును కలుగజేయును, దుఃఖముగానుండునట్టిది దానితోగూడినవారికిన్ని దుః

మే కలుగజేయును. ధనము భార్యపుత్రులు మొదలైనవి ఆనందమయమైనవిగా నుండుటవల్లనే లోకులకు వానియందు ప్రియముగానున్నది. అయినను ఒకయింటి చుట్టు నిప్పంతగులుకొని రగులుచుండగా అప్పట్లో ఆయింటివాడు తనకుప్రియములైన భార్యబిడ్డలు ధనము మొదలైనవాటిని కాపాడుటకు ప్రయత్నించుచుండును. అట్లు ప్రయత్నించుచుండునప్పుడు తనకు అపాయముగలుగునట్లుండెనా పైచెప్పినవానినన్నిటిని విడిచిపెట్టి తన్ను కాపాడుకొనుటకై ప్రయత్నించును. కాబట్టి అన్నికంటెను ఆత్మస్వరూపుడగు తానే తనకు మిక్కిలి ప్రియముగానున్నాడుగాన, ఆత్మ పరమానందరూపుడగుచున్నాడు.

శ్రుతి॥ఏషోస్య-పరమ-ఆనంద। ఏతస్యైవా-నందస్యాన్యాని-భూతాని-మాత్రాముప-జీవంతి॥ బృహదారణ్యోపనిషత్తు.

తాత్ప॥ ఈ ఆనందరూపుడగు ఆత్మ దేహముననుండుటవల్లనే సకలజంతువులున్ను జీవించి సంచరించుచుండును.

## ఆత్మకు నిత్య లక్షణము.

---

శ్రుతి॥ అశబ్ద-మస్పర్శ-మరూప- మవ్యయం-తథారసం- నిత్యమగంధంచ-యత్ । అనాద్యనంతం-మహతఃపరం - నిచాయతం- మృత్యుముఖాత్-ప్రముచ్యతే॥ కఠోపనిషత్తు.

తాత్ప॥ ఆత్మ శబ్దములేనిది, అనగా శబ్దగుణమును గలిగినటువంటి ఆకాశము ఆత్మకాదు. ఆత్మస్పర్శములేనిది,అనగా స్పర్శగుణముగలిగినటువంటి వాయువు ఆత్మకాజాలదు. ఆత్మ రూపములేనిది, అనగా రూపగుణముగలిగినటువంటి అగ్ని ఆత్మకాదు. ఆత్మ రసములేనిది, అనగా రసగుణముగలిగిన జలము ఆత్మకాదు. ఆత్మగంధములేనిది,అనగా గంధముగుణముగలిగిన పృథివి ఆత్మకానేరదు. ఆత్మ నిత్యమైనది, అనగా శరీరములరీతిగా వృద్ధిక్షయము గలిగినదికాదు. సదా ఏకరీతిగానుండునది. ఆదిమధ్యాంతములులేనిది. ఇంతపొడుగు ఇంతపొట్టి ఇంతలావు ఇంత[illegible]ని, కొలతకు లోబడునదిగాదు. స్థూలమైనవస్తువులు ఆ

త్మ కాదు. ఆత్మబుద్ధికంటెను వేరుగానున్నది. రూపనామములులేక సదా జ్ఞానమాత్రమై సత్తుగానున్నది. ఆత్మ అణువుకాదు మహత్తుకాదు. ఇట్టిఆత్మను ఎవరెరుంగుచున్నారో, వారే జననమరణములులేనివారై నిత్యానందమగు మోక్షమును జెందుదురు.

## ఆత్మకు నిర్మల లక్షణము.

శ్రుతి॥ సూర్యో-యథా-సర్వలోకస్య-చక్షు-ర్నలిప్యతే। చాక్షుషై-ర్బాహ్యదోషైః । ఏక స్తథా-సర్వభూతాంతరాత్మా-నలిప్యతే - లోక దుఃఖేన-బాహ్యః॥ కఠోపనిషత్తు.

తాత్ప॥ సూర్యుడు ప్రకాశించుచుండగా వాని కిరణములు సుగంధంబులగు పుష్పాదులందును దుర్గంధవస్తువులందును వ్యాపించియున్నను, ఆవస్తువులయొక్క సుగంధదుర్గంధములు ఆ సూర్యుని జెందనట్లు, సకలజంతువుల హృదయములందు వసించునట్టి ఆత్మకు ఆయాజంతువులుచేయు పుణ్యపాపములు అంటజాలవు. ఆత్మ పుణ్యపాపములేని నిర్దోషుడగుటవలన నిర్మలుడగుచున్నాడు.

## ఆత్మకు స్వయంప్రకాశ లక్షణము.

శ్రుతి॥ నతత్ర-సూర్యోభాతి- నచంద్రతారకం-నేమావిద్యుతో-భాతి। కుతోయమగ్నిః-తమేవ-భాంత-మనుభాతిసర్వం-తస్యభాసా- సర్వమిదం-విభాతి॥ కఠోపనిషత్తు.

తాత్ప॥ తేజోవంతములైన సూర్యచంద్ర అగ్ని నక్షత్రాదులు, స్వయంప్రకాశ పరబ్రహ్మమగు ఆత్మ సత్తామాత్రముచేతనే ప్రకాశించుచున్నవిగాన, అవి ఆత్మను ప్రకాశింపచేయజాలవు. అగ్నియొక్క చేరికవలన కట్టెలు ఆయగ్నిరూపమునుజెంది ఇతరపదార్థములను కాల్చునట్లు, ఆత్మసత్తామాత్రముచేతనే సూర్యచంద్రాదులున్ను తేజోవంతంబులై ఇతరపదార్థములను ప్రకాశింపచేయుచున్నది. కాబట్టి ఆత్మను ప్రకాశింపజేయు వస్తువు ఏదిన్ని లేదు. ఆత్మ తనకుతానే సహజముగా జ్ఞానప్రకాశముగానున్నది.

శ్రుతి॥ అస్తమిత-ఆదిత్యే-యాజ్ఞవల్క్య-చంద్రమస్యస్తమితే। శాంతేగ్నౌ-శాంతాయాం-వాచి।కింజ్యోతి-రేవాయం- పురుషః।ఇత్యాత్మైవాస్య-జ్యోతిర్భవతి॥ బృహదారణ్యోపనిషత్తు.

తాత్ప॥ సూర్యచంద్ర దీప ప్రకాశములులేనట్టి చీకటి సమయంబున నీవు నీదేహమున్నదనియు ఈప్రపంచమున్నదనియు చీకటితోచుచున్నదనియు ఏజ్యోతిప్రకాశమువలన నీవు ఎరుగుచున్నావో అదే స్వయంజ్యోతియనియు ఆత్మయనియు చెప్పబడును. ఈశరీరంబున ఆత్మ లేనియెడల సూర్యచంద్రులు ప్రకాశించుచున్నను, నీవు నీదేహమును ఎరుగజాలవు, ప్రపంచమునున్ను ఎరుగజాలవు, సూర్యచంద్రాదులున్నవనియు ఎరుగజాలవు, నీదేహమునందుఆత్మ వసించుటవల్లనే సర్వము ఎరుగుచున్నావు కాబట్టి అట్టి ఆత్మయొక్క ప్రకాశమువల్లనే సూర్యచంద్రాదులున్న ప్రపంచముసర్వమున్ను కనబడుచుండును, లేకున్న కనబడవు కాబట్టి ఆత్మ,పరంజ్యోతియని, స్వయంప్రకాశమనియు చెప్పబడును.

జపతపాదులు నిష్ఫలంబులనుట.

శ్రుతి॥ విహాయ-శాస్త్రజాలాని-యత్సత్యం-తదుపాస్యతాం। అనంతకర్త-శౌచ-పంచ-జపో-యజ్ఞ-స్తథైవ-తీర్థయాత్రాధిగమనం యావత్-తత్వం-నవిందతి॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ నానావిధ శాస్త్రములు చదువవలయుననెడి భ్రాంతిని విడిచిపెట్టి తత్వవివేకముచేసి ఆత్మయే సత్యమగు పరబ్రహ్మమని యెరింగి ఆత్మానుసంధానమే చేయుచుండవలయును. స్నాన సంధ్య జపతపహోమ నేమ యాగ తీర్థయాత్రాది సకలసత్కర్మములు చేయుటవలన తత్వజ్ఞానము కలుగజాలదు, ఆత్మానుభవము గలుగజాలదు,

శ్రుతి॥ అధీత్య-చతురో-వేదాన్-సర్వశాస్త్రా-న్యనేకశః। బ్రహ్మతత్వం-నజానాతి।దర్వీ-పాకరసం-యథా॥ ముక్తికోపనిషత్తు.

తాత్ప॥ మధురమైన పదార్థములను వంటజేసి అందులో అపకకాడ వేసిపెట్టినప్పటికిన్ని ఆయపకకాడ ఆపదార్థములయొక్క రుచిని ఎరుగజాలనట్లు, సకల శాస్త్రములుచదివి పండితుడైనను గురుక

టాక్షుమువలన వేదాంత శ్రవణమననిధిధ్యాసనములుగలవాడై తత్వ
జ్ఞానసంపన్నుడై ఆత్మానుభవమును బొందనియెడల, వాడు వ్యర్థుడేసుమా.

శ్రుతి॥ సంత్యజ్య-హృద్గుహేశానం-దేవమన్యం-ప్రయాంతి-యే।
తే-రత్న-మభివాంఛంతి-త్యక్త-హస్తస్థ-కౌస్తుభాః॥ మహోపనిషత్తు.

తాత్ప॥ హృదయమందున్న ఆత్మదేవతను తెలియక వేరొక్కచోట దైవమున్నదని భావించువారు చేతనున్నట్టి దేవలోకమునందలి దేవరత్నమగు కౌస్తుభమణిని విడచిపెట్టి భూలోకమునందలి సామాన్యమగు రత్నమును వెతకుచుండువానితో సమానులగుచున్నారు.

శ్రుతి॥ బహుశాస్త్రకథాకంథా-రోమంథేన-వృథైవ-కిం। అన్వేష్టవ్యం-ప్రయత్నేన-మారుతే-జ్యోతిరాంతరం॥ ముక్తికోపనిషత్తు.

తాత్ప॥ ఆంజనేయా! సకలశాస్త్రములు చదివినందువలన ప్రయోజనములేదు, ముక్తిబొందజాలవు. ఈదేహమునందు వసించు పరబ్రహ్మమగు ఆత్మను అంతరంగదృష్టివలన దర్శించినయెడల ముక్తిబొందగలవు.

శ్రుతి॥ నైవమాత్మా-ప్రవచనేన-శతేనాపి-లభ్యతే। నబహుశ్రుతేన-నబుద్ధిజ్ఞానశ్రుతేన-నమేధయా-నదేవైర్నయజ్ఞై-ర్నతపోభిరుగ్రై-ర్నసాంఖ్యై-ర్నయోగై-ర్నాశ్రమై-ర్నాన్యై-రాత్మాన-ముపలభంతే॥ సుబాలోపనిషత్తు.

తాత్ప॥ ఈ ఆత్మానుభవము మాటలచేతను, నిస్సారమగు శ్రవణముచేతను, బుద్ధిచాతుర్యముచేతను, యాగముచేతను, దేవతాధ్యానాదులవల్లను, తపస్సుచేయుటవల్లను, సాంఖ్య హఠాది యోగములచేతను, వర్ణాశ్రమధర్మములు తప్పక అనుష్ఠించుటచేతను గలుగజాలదు.

శ్రుతి॥ అమృతేన-తృప్తస్య-పయసా-కింప్రయోజనం। ఏవం-స్వాత్మానం-జ్ఞాత్వా-వేదైః-ప్రయోజనం-కింభవతి॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ అమృతపానముచేసినవానికి జలపానము చేయుటవలన ఫలములేనట్లు వేదాంతవిచారణచే ఆత్మానుభవము బొందిన వానికి వేదములతో పనిలేదు.

శ్రుతి॥ అత్యంతమలినో-దేహో-దేహీచాత్యంత-నిర్మలః । ఉభయోరంతరం-జ్ఞాత్వా-కస్యశౌచం-విధీయతే ॥—ముక్తికోపనిషత్తు.

అర్థ॥ తల్లితండ్రులయొక్క శుక్లశోణితములవలన వచ్చిన ఈ మాంసశరీరము అశుద్ధము, ఇందువసించు ఆత్మ నిర్మలమైనవాడు, గనుక ఈరెండుతత్వములను విచారించిన జ్ఞాని దేనికి శౌచము చేయును. అనగా అశుద్ధమైన దేహమునకే స్నానశౌచాదులు చేయవలయును గాని, పరిశుద్ధుడగు ఆత్మకు స్నానశౌచాదులతో పనిలేదు, ఈ శౌచాదులవలన ఆత్మ పరిశుద్ధుడగుచున్నాడనుట వృథా భ్రమగానున్నది.

శ్రుతి॥స్వస్వరూపస్య-విజ్ఞానాత్-నాధికం-తీర్థముచ్యతే॥జ్ఞానవాసిష్ఠం

తాత్ప॥ ఆత్మానుభవజ్ఞానమను తీర్థమునందు స్నానముచేసినవారే ముక్తిబొందుదురుగాని, ఇతరులు బొందజాలరు.

శ్రుతి॥ ఉత్తిష్ఠ-జాగ్రతః-ప్రాప్య-వరాన్-నిభోదత।క్షురస్య-ధారా-నిశితా-దురత్యయా-దుర్గం-పదం-తత్కవయో-వదంతి॥ కఠోపనిషత్తు.

తాత్ప॥ అజ్ఞానమనెడి మహాచీకటిలో నిద్రించు ఓ జనులారా! లేవండి, జాగ్రతనుబొందండి, నిజగురుకటాక్షముచే ఆత్మానాత్మవివేకము మొదలగు వేదాంతవిచారణచేసి ఆత్మానుభవజ్ఞానమును బొందండి, గురుకటాక్షములేనివారికి ఈజ్ఞానము పట్టాకత్తులుమీద నడుచునట్లు బహుకష్టముగానుండును. అనిచెప్పియున్నది. పంచకోశమయంబగు ఈశరీరమున ఆత్మ వసించుచున్నాడుకాబట్టి, పంచకోశములు ఇట్టివని తెలియకున్న ఆత్మ ఇట్టిదని తెలియజాలదు. పంచకోశముల లక్షణము చెప్పుచున్నాను వినుమని యిట్లనియె.

## పంచకోశవివేకము.

---

శ్రుతి॥ అంతశ్శరీరే-నిహితో-గుహాయాం॥ అధ్యాత్మోపనిషత్తు.

తాత్ప॥ ఈ ఆత్మ, పంచకోశంబులుగానుండెడు ఈ శరీరంబున వసించుచున్నాడుగాన పంచకోశములను పలానిదని తెలియనియెడల,

ఆత్మస్వరూపమిట్టిదని తెలియజాలరుగాన, పంచకోశముల లక్షణంబు లను చెప్పుచున్నాను శ్రద్ధతో వినుమని యిట్లనియె. ఓ ఆంజనేయా ఈశరీరము అయిదుకోశములుగానున్నది. అవి ఏవి అనగా, అన్నమ యము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము, ఆనందమ యములనబడును. కత్తిని ఒరయు, చింతపండును చింతగుల్లయు, తం బూరను గవిసెనయు కప్పుకొని వాటిని కనబడక జేయునట్లు, ఆత్మను ఈకోశములు కప్పుకొని కనబడకుండా జేయును. అయితే జ్ఞానస్వ రూపుడగు ఆత్మను అజ్ఞానస్వరూపములగు ఈ కోశములు ఎట్లు కన బడకుండా చేయుచున్నదనగా, సూర్యకిరణములవలన గలిగిన మేఘ ములు సూర్యుని కప్పుకొని కనబడకుండా జేయునట్లున్ను, అగ్నివలన కలిగిన ధూమము ఆయగ్నిని కప్పుకొని కనబడకుండాజేయునట్లున్ను, ఆత్మ సత్తావలనగలిగిన ఈకోశములు ఆత్మనుకప్పుకొని కనబడకుం డా జేయుచుండును. ఐతే కత్తిని ఒరయున్ను, చింతపండును దాని గుల్లయున్ను, కప్పుకొని ఒక్కటిగాతోచుచుండినను పరీక్షించి చూచు నప్పుడు కత్తి వేరు ఒర వేరుగాను, చింతపండువేరు దానిగుల్లవేరుగా ను తోచునట్లు, ఆత్మను ఈపంచకోశములు కప్పుకొని ఒక్కటిగా తోచుచున్నను, తత్వవివేకమువలన ఆత్మవేరు పంచకోశములు వేరుగా తోచును,అని శ్రీరామచంద్రుండు చెప్పగా శ్రీఆంజనేయుండు స్వామీ రామచంద్రా పంచకోశములకంటెను వేరుగానుండు ఆత్మకు ఆపంచ కోశములతోడ కూటమి యెట్లుగలిగెను, అనియడుగగా శ్రీరామచం ద్రుండు చెప్పుచున్నాడు. ఓ ఆంజనేయా అన్యోన్య అధ్యాసమువలన గలిగెను. ఈ వస్తువుయొక్క ధర్మము ఆవస్తువునందును ఆవస్తువుయొక్క ధర్మను ఈవస్తువునందును తోచుట అధ్యాసమనబడును. అట్టి అధ్యా సమువలన ఆత్మకును పంచకోశములకున్ను కూటమిగల్గెను. ఎట్లనగా,

శ్రుతి॥ అన్నరసే నైవ-భూత్వాన్న-రసేనాభివృద్ధిం-ప్రాప్యాన్న-రస మయ-పృథివ్యాం-యద్విలీయతే-సోన్నమయ-కోశః॥ పైంగలోపనిషత్

తాత్ప॥ మనము భుజించు అన్నరసమే శుక్లశోణితంబులగుచు

స్త్రీపురుషులు సంభోగింపగా, అవి ఒక్కటిగాకలిసి తల్లిగర్భమందు నిలిచి పిండరూపమై పిమ్మట నానాట మాంసము నెత్తురు నరములు ఎముకలు రోమములు చర్మము మొదలగు సప్తధాతువులుగలిగి, దశమాసములు నిండినంతనే శిరస్సు నేత్రములు మొదలగు అవయవములతోడ శిశురూపముగా తల్లిగర్భమునుండి జన్మించి, నానాట అన్నరసముచేత వృద్ధిజెంది, కడపట కొన్నాళ్ళకు క్షీణించి మట్టితోడ మట్టిగా లయించిపోయెడు స్తంభమువలె స్థూలముగానుండు మాంసశరీరమే అన్నమయకోశమనబడును. దీనికిని ఆత్మకున్ను కూటమి ఎట్లువచ్చెననగా, నేనుబ్రాహ్మణుడను నేనుమానవుడను నేనుపురుషుడను నేనుస్త్రీని అనెడు జాతిభేదములున్ను, నేను బ్రహ్మచారిని నేనుగృహస్థుడను నేనుసన్యాసిని అనెడు ఆశ్రమభేదములున్ను, నేనుబాలుడను నేనువృద్ధుడను అను వయోభేదములున్ను, నేను పుట్టితిని నేనుచావగలను నేనుపెరుగుచున్నాను నేనుచిక్కిపోతిని అను షడ్వికారములున్ను నేనుభారధ్వాజగోత్రుడను నేనుకాస్యపగోత్రుడను ఇవిమొదలగు గోత్రభేదములున్ను, నేనురాముడను నేనుగోవిందుడను అను నామభేదములున్ను, నేను ఎఱ్ఱనివాడను నేచు నల్లనివాడను అను వర్ణభేదములున్ను, నేనుపొట్టివాడను నేనుపొడుగువాడను అను రూపభేదములున్ను, నేను శైవుండను నేనువైష్ణవుండను నేనుస్మార్తుండను అను మతభేదములున్ను, నేనుపౌరాణికుడను నేనుదీక్షితుడను నేనుఅవధానిని అను వేషభేదములున్ను, ఇవిమొదలైనవి స్థూలశరీరమగు అన్నమయకోశమునకుగల ధర్మములేగాని, ఈకోశమునకంటె వేరుగానుండు సాక్షిస్వరూపుడగు ఆత్మకు ఎంతమాత్రమునులేవు, అయితే భ్రాంతివలన ఆత్మస్వరూపుడగుతనకు గలిగినట్లున్ను, [నాదేహము లెస్సగానున్నదని] అనుటవలన ఆత్మయొక్క సత్యజ్ఞానానందలక్షణములు దేహమునందును తోచుచున్నదిగాన ఆత్మకున్ను అన్నమయకోశమునకున్ను కూటమి గలిగెను.

శ్రుతి॥ కర్మేంద్రియైః-స్సహ-ప్రాణాది-పంచకం। ప్రాణమయ-కోశః। పైంగలోపనిషత్తు.

తాత్ప॥ వాక్కు పాణి పాదము ఉపస్థ గుదము అను కర్మేంద్రియములైదున్ను, ప్రాణ అపాన ఉదాన వ్యాన సమానములనెడు పంచప్రాణములున్ను గూడి ప్రాణమయకోశమనబడును. దీనికిన్ని ఆత్మకున్ను కూటమి ఎట్లుగలిగెననగా, నేనుఆకలిచేత తపించుచున్నాను, నాకునిండా దప్పిగానున్నది, నేనుబలశాలిని, నేనుక్రియావంతుడను నేనువాచాలకుడను నేనుదాతను నేనుభూసంచారిని నేను మలమూత్రములు విడుచుచున్నాను నేను సంభోగించుచున్నాను నేను మూగవాడను నేనుచేయిలేనివాడను నేనుకాళ్లులేనివాడను నేనునపుంసకుడను, అనునివి మొదలగు ధర్మములు, కర్మేంద్రియములు ప్రాణవాయువున్ను గూడిన ప్రాణమయకోశ ధర్మములేగాని, ఈకోశమునకంటెను వేరుగానుండు సాక్షిస్వరూపుడగు ఆత్మకు ఎంతమాత్రమున్ను లేవు. అయితే ఆత్మస్వరూపుడగుతనకు ఈధర్మములు గలిగినట్లున్ను, (నాప్రాణములెస్సగానున్నదని) అనుటవలన ఆత్మయొక్క సత్యజ్ఞానానందలక్షణములు ప్రాణమునందును గలిగినట్లు తోచుటవలన, ఆత్మకున్ను ప్రాణమయకోశమునకున్ను కూటమిగలిగెను.

శ్రుతి॥ జ్ఞానేంద్రియైస్సహ-మనః-మనోమయకోశః। పైంగలోపనిషత్తు.

తాత్ప॥ చెవులు దేహచర్మము నేత్రములు మొదలగు జ్ఞానేంద్రియములయిదున్ను మనస్సున్ను గూడి మనోమయకోశమనబడును. దీనికిన్ని ఆత్మకున్ను కూటమి ఎట్లు కలిగెననగా, నేనుసంకల్పవికల్పములు గలవాడను, నేనుదుఃఖిని, నేను మోహిని, కామిని, నేను ద్వేషిని, నేను రాగిని, నేనువినుచున్నాను, నేనుచూచుచున్నాను, నేనుతాకుచున్నాను నేనురుచిచూచుచున్నాను, నేనువాసనచూచుచున్నాను, నేను చెవిటి వాడను నేనుగ్రుడ్డివాడను నేనుముక్కులేనివాడను నేనునాలుకలేనివాడను అనునివి మొదలగువికారములు, జ్ఞానేంద్రియములున్ను సంకల్పవికల్ప రాగద్వేష కామక్రోధాది రూపములుగానుండు మనస్సున్ను గూడిన మనోమయకోశముయొక్క ధర్మములేగాని, ఈకోశమునకంటెను వే[illegible] సాక్షిస్వరూపుడగు ఆత్మకు ఈధర్మములు ఎంతమాత్రమున్ను

లేవు. ఆత్మస్వరూపుడగు తనకు ఈధర్మములు గలిగినట్లున్ను, [నామన స్సు లెస్సగానున్నదని] అనుటవలన ఆత్మయొక్క సత్యజ్ఞానానంద లక్షణములు మనస్సునందును గలిగినట్లు తోచుటవలన, ఆత్మకున్ను మనోమయకోశమునకును, కూటమి గలిగెను.

శ్రుతి॥ జ్ఞానేంద్రియైస్సహ-బుద్ధిర్విజ్ఞాన-మయః కోశః॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ జ్ఞానేంద్రియంబులైదున్ను బుద్ధిన్ని గూడి విజ్ఞానమయకోశమనబడును, దీనికిన్ని ఆత్మకున్ను కూటమి ఎట్లుకలిగెననగా, నేనుసకలకార్యములను నిశ్చయించువాడను, నేనుఊహాపోహ...వాడను నేను చతురుండను నేను ఏకసంతగ్రాహిని నేనుద్విసంతగ్రాహిని నేను శ్రోత్రియుండను నేను విరక్తుండను నేనుపండితుండను నేనుస్వర్గాది దేవలోకములకు పోవువాడను అనునివిమొదలగు ధర్మములు, జ్ఞానేంద్రియంబులున్ను నిశ్చయవృత్తిగలబుద్ధిన్ని గూడినవిజ్ఞానమయకోశమునకు గల ధర్మములేగాని, ఈకోశమునకంటె వేరుగానుండు సాక్షిస్వరూపుడగు ఆత్మకు ఎంతమాత్రమున్ను లేవు. అయితే ఆత్మస్వరూపుడగు తనకు ఈధర్మములు గలిగినట్లున్ను, (నాబుద్ధి నిండా జ్ఞానముతోడనున్నదని) అనుటవలన, ఆత్మయొక్క సత్యజ్ఞానానందాది లక్షణములు బుద్ధియందున్ను భ్రాంతిచేత దోచుటవలన,ఆత్మకున్ను విజ్ఞానమయకోశమునకున్ను కూటమి కలిగెను.

శ్రుతి॥ ఏతత్-కోశత్రయం-లింగశరీరం॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥(ప్రాణమయ మనోమయ విజ్ఞానమయములనెడు ఈమూడుకోశములుగూడి సూక్ష్మశరీరము లేక,లింగశరీరమనబడును.)మరణించినతర్వాత ఈలింగశరీరముతోడనే జీవుడు స్వర్గాది లోకాంతరములకుంబోవుచు, మరల తల్లిగర్భంబున స్థూలశరీరంబునం జొచ్చి పుట్టుచు చచ్చుచుండును. కాబట్టి ఈలింగశరీరము భంగముకాకుండిన ముక్తిలేదు. ఐతే అజ్ఞానమనెడి కారణశరీరము నశింపకుండినయెడల,లింగశరీరము భంగము కాజాలదుగాన, మొట్టమొదట అజ్ఞానమనెడి కారణశరీరమును నశింపజేయవలయును, అట్లుదానిని నశింపజేసినయెడల

తర్వాత ప్రారబ్ధము క్షయించినతోడనే లింగశరీరము నశించి జీవుడు ముక్తిజెందగలడు.

శ్రుతి|| స్వరూపాజ్ఞాన-మానందమయ-కోశః|| పైంగలోపనిషత్తు.

తాత్ప|| అజ్ఞానమున్ను, ప్రియ మోద ప్రమోదములనెడి త్రివిధ సంతోషములున్ను గూడి ఆనందమయకోశమనబడును. ఇదే కారణ శరీరము. తనకు ఇష్టమైన వస్తువును చూచినంతనే కలుగు సంతోషము, ప్రియమనబడును, ఆవస్తువు తన చేతికి లభించినమాత్రమున గలుగు సంతోషము, మోదమనబడును. ఆవస్తువు భుజించినతర్వాత గలిగిన సంతోషము, ప్రమోదమనబడును. ఈ ఆనందమయకోశమునకున్ను ఆత్మకున్ను కూటమి ఎట్లుగలిగెననగా, నేను అనుభవించువాడను నేనుసంతోషముగలవాడను నేనుసుఖిని సాత్వికుడను రాజసుండను నేను తామసుండను నేనుఅజ్ఞానిని, నేనుమూఢుడను నేనుఅసంతుష్టిని నేను అవివేకిని నేనుభ్రమగలవాడను అనునివిమొదలగు ధర్మములు,అజ్ఞానము ప్రియ మోద ప్రమోదములున్ను గూడిన ఆనందమయ కోశముయొక్క ధర్మములేగాని, దీనికంటెను వేరుగానుండు సాక్షియగు ఆత్మకు ఇవి ఎంతమాత్రమున్ను లేవు, అయితే ఈ ఆనందమయకోశధర్మములు ఆత్మస్వరూపుడగుతనకు గలిగినట్లున్ను (నాఅజ్ఞానము లెస్సగానున్నదని) అనుటవలన ఆత్మయొక్క సల్లక్షణము ఈఆనందమయకోశమునందున్ను గలిగినట్లు భ్రాంతిచే దోచుటవలన, ఆత్మకున్ను ఆనందమయ కోశమునకున్ను కూటమి కలిగెను. ఓ ఆంజనేయా ఇట్లు పంచకోశముల యొక్కధర్మములు ఆత్మయందును, ఆత్మయొక్క సత్యజ్ఞానానంద లక్షణములు పంచకోశములందున్ను తోచుచుండినను, ఈపంచకోశములకంటెను ఆత్మ వేరుగాఉన్నది. ఎట్లనగా ఒకడు నాఆవు నాదూడ నాభార్య నాబిడ్డ నాకొయ్య అని చెప్పునప్పుడు, ఎట్లు ఆయావు దూడ మొదలగువానికంటెను వాడు వేరుగానుండుచు చెప్పుచున్నాడో అట్లు నాశరీరము నాప్రాణము నామనస్సు నాబుద్ధి నాఅజ్ఞానమ ... సంబంధించుకొని తోచెడి ఈపంచకోశములకంటెను ఆ

స్వరూపుడగు తాను వేరుగానేయున్నాడు, మరియు ఒకనియొక్క ఆవు దూడ చిక్కిపోయినను, లేక బలిసియున్నను, లేక వానిపెండ్లాము గుణవంతురాలుగానున్నను, లేక మూర్ఖురాలుగానున్నను దానివికారములు గుణములు వానిని అంటనట్లు అన్నమయకోశ సంబంధములగు జాతికుల గోత్రరూపనామాది వికారములున్ను ప్రాణమయకోశసంబంధమగుఆకలి దప్పిమొదలగువికారములు మనోమయకోశసంబంధమగుసంకల్పవిల్పాది వికారములున్ను విజ్ఞానమయకోశ సంబంధమగు కర్తృత్వాది వికారములున్ను, ఆనందమయకోశ సంబంధములగుభోక్తృత్వాది వికారములున్న ఈకోశములకంటె వేరుగా సాక్షిగానుండు ఆత్మస్వరూపుడగు తనకు లేవు, తాను నిర్వికార సత్యజ్ఞానానంద స్వరూపుడని అభిప్రాయము. అయితే ఆవు దూడ పెండ్లాము మొదలయినవి తనతోకూడక వేరుగా బాహ్యవస్తువులుగానున్నవి కాబట్టి తానువేరె తనపశువువేరె తాను వేర తనపెండ్లామువేరే అనియు ఎరుగవచ్చును, అట్లుగాక ఆత్మ పంచకోశములతోడ కలిసికొని ఒక్కటిగానున్నది కాబట్టి పంచకోశములకంటెను వేరుగానున్నదనెడి జ్ఞానము ఎట్లు కలుగునంటె -[శ్లో॥ బాహ్య-దృష్టి ర్నేత్రం- అంతర్దృష్టి-ర్బుద్ధిః । బాహ్య - దృష్ట్యా-జ్ఞాతుమశక్యా-అపిపదార్థాః।అంతరదృష్ట్యా-జ్ఞాతుం-శక్యంతే॥] అనెడి శ్లోకరీతిగా, బాహ్యదృష్టి నేత్రముగాను, అంతర్దృష్టి బుద్ధిగాను ఉన్నది. బాహ్యదృష్టియగు నేత్రములచేత ఎరుగుటకు సాధ్యముగాని విషయములను అంతర్దృష్టియగు బుద్ధిచేత ఎరుగవచ్చును.—ఎట్లనగా జలము, ఉష్ణము, ఈరెండున్ను కలిసి ఉండినప్పటికిన్ని చేతితో అంటిచూచి బుద్ధిచేత ఉష్ణమువేరు, జలమువేరు, అనిఎరుగుచున్నట్లున్ను, గోడయందు వ్రాయబడిన చిత్రములు గోడతోకలిసికొని ఒక్కటిగాతోచుచున్నప్పటికిన్ని బుద్ధిచేత గోడవేరు చిత్రము వేరు అనియెరుగునట్లు, ఆత్మ పంచకోశములతోడ కలిసికొని ఏకముగాతోచుచున్నను, బుద్ధిచేత ఆత్మవేరు పంచకోశములువేరు అనియెరుగవచ్చును. ఆంజనేయా ఇదివరకు పంచకోశములను ఒకవస్తువుగానుంచుకొని వీనికంటెను ఆత్మ వేరుగా

నున్నదని, ఆత్మను ఎరుగుటకుగాను చెప్పితిని, అయితే యథార్థముగా విచారించి చూడగా త్రాటియందు ఆరోపించబడిన సర్పము ఆత్రాటి కంటెను వేరుగా లేనిరీతిని, ఆత్మయందు ఆరోపించబడిన పంచ కోశములు ఆత్మకంటెను వేరుగాలేదుసుమా. ఐతే ఆత్మకంటెను పంచ కోశములు వేరుగాలేవని యెరిగినప్పటికిన్ని నాచేయి నాకాలు నాదేహ ము నాప్రాణము నామనస్సు నాబుద్ధి అని వేరువేరుగా వ్యవహారమున్న దిగాని లేకపోలేదు, అయితే మట్టివలన గలిగిన కుండలం చట్లు మొదల గునవి ఆమట్టికంటెను వేరుగా నానావిధ నామరూపములతో వేరువేరు గా తోచుచుండినను సూక్ష్మబుద్ధిచేత మట్టికంటెను వేరుగా అవి ఒక పదార్థముగా లేవని ఎరిగినరీతిని, ఆత్మయందు ఆరోపించబడిన పంచకో శములున్ను వ్యవహారమునందు వేరువేరుగా తోచుచున్నప్పటికిన్ని అవి అధిష్ఠానమగు ఆత్మకంటెను వేరైనవస్తువులుగా లేదనియు సూక్ష్మబుద్ధి చేత ఎరుగవచ్చును ఇట్లు ఎరుగుటే పంచకోశ వ్యతిరిక్తజ్ఞానము అన బడును. ఈజ్ఞానవిచారణవలన ఫలమేమంటివా, ఆత్మ అవస్థాత్రయ మునందును అనుస్యూతుడైయున్నాడనియు, పంచకోశములు అవస్థా త్రయమునందును అనుస్యూతములై యుండలేదనియు, మరియు పంచకో శములున్ను వాని వికారములున్ను తోచుచుండినప్పటికిన్ని, అవి ఆత్మ స్వరూపుడగు తనకంటె వేరుగాలేవనియు ఎరుగవలయును, ఇట్లు ఎరిగి నప్పటికిన్ని నేనుతిన్నాను, నేనుఅనుభవించినాను, నేనుజలముత్రాగితిని, అని వ్యవహారములున్న దేగాని లేకపోలేదు. అయినను ఎండమావులందు జలము లేదని ఎరిగినప్పటికిన్ని ఆ ఎండమావులందు జలముమాత్రము ఉం డునట్లు కనబడుచుండును, అట్లు ఆత్మస్వరూపుడగు తనకంటెను వేరు గా పంచకోశములున్ను వానివికారములున్ను ఒకపదార్థముగాలేదని యెరిగినప్పటికిన్ని భ్రాంతిచే ఆత్మకంటెను ఈపంచకోశములు వేరు గానుండునట్లు తోచుచుండును. అట్లు తోచుచున్నను బంగారమే నానావిధ నామరూపములతో నానావిధ భూషణములుగా తోచుచు టును, మట్టియే కుండలుచట్లుగా తోచునట్లున్ను, ఆత్మస్వరూపుడ

గు తానే పంచకోశములుగాను, నానావిధ నామరూపములుగాను తో చుచున్నాడేగాని,యథార్థముగా విచారించిచూడగా,[శ్రుతి|| ఆత్మనో-నాన్యత్కించన కించన,ఆత్మైవేద-మమృతం-సర్వం-నేహ-నానాస్తి-కించన||] అనెడి బృహదారణ్యోపనిషత్తు రీతిగా, ఆత్మస్వరూపుడగు తన కంటెను వేరుగా ఏపదార్థమున్ను లేదనియు, మరియు రజ్జుసర్ప భ్రాంతిరీతిని పంచకోశములున్ను సర్వ ప్రపంచమున్ను ఆత్మస్వరూపుడగు తనయందు భ్రాంతిచే వేరువేరుగాతోచుటవలనఅవి కల్పితంబులగు యు అసత్యంబులనియు, ఆత్మస్వరూపుడగుతాను సత్యజ్ఞానానంద నిత్య నిర్మల నిర్వికార శుద్ధనిర్గుణ సర్వపరిపూర్ణ కేవలసాక్షిమాత్ర పరబ్రహ్మమనియు, ఎరిగి తన్మయుండై ఆనందించువాడేముక్తుడని అభిప్రాయము.

జీ వ ల క్ష ణ ము.

---

శ్రుతి|| గుహాంప్రవిష్టౌ-పరమే-పరార్ధ్యే| ఛాయాతపౌ-బ్రహ్మవిదో-వదంతి|| కఠోపనిషత్తు.

తాత్ప|| ఎండయు, ప్రతిబింబమగు నీడయు వలె పరబ్రహ్మమగు ఆత్మయు ప్రతిబింబమగు జీవుడున్ను వీరిద్దరు ఈదేహమున వసించు చున్నారు.

శ్రుతి|| ఏకధా-బహుధాచైవ-దృశ్యతే-జలచంద్రవత్|| త్రిపురాతాపిన్యుపనిషత్తు.

తాత్ప|| ఒక్కచంద్రుడే అనేక నీళ్లకుండలందు ప్రతిబింబించి అనేక చంద్రులుగా తోచునట్లు, పరబ్రహ్మమగు ఆత్మ ఒక్కడే నానా జంతువులయొక్క శరీరంబులలోపల నానా అంతఃకరణములందు ప్రతిబింబించి అనేక జీవులుగా తోచుచుండును.

శ్రుతి|| రూపంరూపం - ప్రతిరూపో - బభూవ || కఠోపనిషత్తు.

తాత్ప|| అంతఃకరణ ప్రతిబింబమే చిదాభాస జీవుడనబడును,

శ్రుతి|| అంతఃకరణ-ప్రతిబింబ-చైతన్యం-యత్ - తదేవావస్థా-త్రయ-భాగ్భవతి|| పైంగలోపనిషత్తు,

తాత్ప॥ అంతఃకరణము బాహ్యసంచారము చేయుటవలన మనస్సని చెప్పబడును, అంతస్సంచారము చేయుటవలన బుద్ధి అనబడును. అంతఃకరణ ప్రతిబింబమే జీవుడనబడును. ఈజీవుడు జాగ్రత స్వప్న సుషుప్తులనెడి అవస్థాత్రయములకు లోబడినవాడగుచు ఆయా అవస్థలందలి విషయంబు లనుభవింపుచుండును. అయితే ఆత్మ ఈఅవస్థాత్రయములకు లోబడనివాడై సాక్షిమాత్రుడుగానుండును. అద్దము జడపదార్థము, దానియందలి ప్రతిబింబమున్ను కల్పితమగుచు జడపదార్థమగుచున్నది. అట్లు అంతఃకరణము జడపదార్థమూ, దానియందలి ప్రతిబింబమున్ను కల్పితమగుచు జడపదార్థమగుచున్నది, కాబట్టి జీవుడు (చేతనుడు అని) అనగా జ్ఞానస్వరూపుడనుచు, నిత్యుడనుచు ఎట్లుచెప్పవచ్చుననగా [శ్రుతి॥ తస్యభాసా-సర్వమిదం-విభాతి॥] కఠోపనిషత్తురీతిని అగ్ని సంబంధమగు కట్టెలున్ను ఆయగ్నిరూపమునుజెంది అగ్నిరీతిగానే ఇతరపదార్థములను దహించునట్లు, అంతఃకరణమున్ను దానియందలి ప్రతిబింబమున్ను జ్ఞానస్వరూపుడగు ఆత్మను ఆశ్రయించి ఒక్కటిగా సంబంధించియుండుటవలన ఆప్రతిబింబమునకు ఆత్మరీతిగా (చేతనత్వము) అనగా, నామనస్సు నాదేహము అని ఎరిగెడి జ్ఞానము, గలుగుటవలన అది చేతనుడనియు జీవుడనియు చెప్పబడును. ఆత్మయొక్క సంబంధములేనియెడల అంతఃకరణమున్ను దానియందలి ప్రతిబింబమున్ను జ్ఞానములేనట్టి జడపదార్థములుగానుండును. కాబట్టి-[ఆత్మేంద్రియ-మనోయుక్తం-భోక్తేత్యాహు-ర్మనీషిణః॥] అను కఠోపనిషత్తురీతిగా ఆత్మ, అంతఃకరణము, ప్రతిబింబము, ఈమూడున్ను చేరి మొత్తమునకు జీవుడని చెప్పబడును. ఐతే యథార్థముగా విచారించిచూడగా అంతఃకరణ ప్రతిబింబమే జీవుడగుచున్నాడు.

శ్రుతి॥ సచావివేక-ప్రకృతిసంగత్యా-తత్రముహ్యతే॥ నానాయోనిశతంగత్వా-శేతేసౌ-వాసనావశాత్ । విమోక్షాత్ - సంచరత్యేవ-మత్స్యః-కూలద్వయం-యథా॥ త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్తు.

[illegible] జ్ఞానేంద్రియాణి - తత్తద్విషయాన్ - ప్ర

ణాం । సంస్కృత్య-కామకర్మాన్వితో-విద్యాభూత - వేష్టితో-జీవో । దేహాంతరం-ప్రాప్య-లోకాంతరం-గచ్ఛతి । ప్రాక్కర్మ-ఫలపాకేన-ఆవర్తాంతర్గ-కీటవత్ । విశ్రాంతిం-నైవగచ్ఛతి॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ అయితే ఆకాశచంద్రునివలె జలచంద్రుడున్ను కదలక మొదలకుండినను, జలము కదలుటవలన జలచంద్రుడున్ను కదలుచుం డును. అట్లు నిర్వికార పరబ్రహ్మమగు ఆత్మయొక్క ప్రతిబింబమగు జీవుడున్ను నిర్వికారుడుగా ఉండినప్పటికిన్ని ఈజీవుడు మాయా మోహితుడై అజ్ఞానియగుచు, సంకల్పవికల్పములు కర్తృత్వాది వికార ములు గలిగి పాదరసమువలె చలించెడు అంతఃకరణముతో గూడు కొని, నేను నాదేహము నాభార్య అనెడి దేహాభిమాన అహంకార మ మకార కామ క్రోధ లోభ మోహ మద మత్సరాది గుణములుగలవా డై స్థూలశరీరముద్వారా అనేక కర్మములనుజేయుచు, తత్ఫలంబులను భవింపుచు మరణించినతర్వాత సూక్ష్మశరీరముతో గూడుకొని సూక్ష్మ రూపియగుచు స్వర్గనరకాదులంజేరి సుఖదుఃఖము లనుభవింపుచు మరల కర్మశేషంబునకుగాను పూర్వకర్మము ననుసరించి నానాయోనులందు బుట్టుచు మరల చచ్చుచు, ఇట్లు ఒకగుంటయందు చిక్కుకొని ఆగుం టను విడిచి బయటికి పోవుటకు శక్తిలేక ఈగట్టునకును ఆగట్టునకును తిరుగుచు అల్లాడుచుండు చేపపిల్ల రీతిగాను, మరియు సుడినీటిలో బగలుకొని దానితప్పించుకొనిపోవుటకు శక్తిలేక చుట్టిచుట్టి తిరుగు చుండు కీటకమురీతిగాను, ఈ జీవుడు జనన మరణ దుఃఖసాగరమున మునిగి దానిదాటి తప్పించుకొని పోవుటకు శక్తిలేక అల్లాడుచుండును,

శ్రుతి॥ సత్కర్మ-పరిపాకతో-బహూనాం-జన్మనామంతే-నృణాం-మోక్షేచ్ఛా-జాయతే। తదా-సద్గురుమాశ్రిత్య - చిరకాలసేవయా-బంధాత్-మోక్షం-కశ్చిత్-ప్రయచ్ఛతి॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ ఇట్లుజీవుడుఅనేకజన్మములందుజేసిన పుణ్యవిశేషంబున మా నవజన్మమెత్తి మోక్షముంబొందవలయుననెడి కోరికగలవాడై సద్గు రువు నాశ్రయించి, వారికి చతుర్విధ శుశ్రూషలుచేయుచు వేదాంతశ్ర

ధణము జేసి, అందువలన ఆత్మానాత్మ వివేకముగలవాడై, (తాను పర బ్రహ్మమగు ఆత్మయొక్క ప్రతిబింబమనియు, తనకు ఈజీవస్వరూపము కల్పితంబనియు, నిర్వికార పరబ్రహ్మమగు ఆత్మ స్వరూపమే తననిజ స్వరూపంబనియు తెలిసి) తానే పరబ్రహ్మమని నిశ్చయించి, నిర్వికారు డై అహంకార మమకారములులేనివాడై ఉపశాంత చిత్తుడై, సదా ఆత్మధ్యానముంజేయుచు, తదాకారముగానుండుచు-[ప్రజ్ఞానఘన-ఏవై తేభ్యో-భూతేభ్య-స్సముత్థాయ- తాన్యేవాను - వినశ్యతి॥] అని యా జ్ఞవల్క్యుడు మైత్రేయి అనెడు స్త్రీకి బోధించిన శ్రుతిప్రకారముగా, ప్రారబ్ధకర్మము నశించినతోడనే దేహమున్ను జీవోపాధిన్ని నశించి, [బ్రహ్మవేద-బ్రహ్మైవ భవతి॥] అను శ్రుతిరీతిగా, ఘటాకాశమహాకా శములు కలిసి ఏకమైనట్లు, అఖండ సచ్చిదానంద నిత్యనిర్మల పరిపూ ర్ణమగు పరబ్రహ్మమునందు ఐక్యమగుచు నిత్యముక్తుడగుచున్నాడు)

శ్రుతి॥ ఏకో-బహూనాం-యోవిదధాతి-కామాన్॥ కఠోపనిషత్తు.

తాత్ప॥ ఓ ఆంజనేయా? పరబ్రహ్మమగు ఆత్మ ఒక్కడే (సకల జీవసాక్షిగానుండుచు, వారివారి యిష్టానుసారముగా ఫలమునిచ్చుచు న్నాడు. అనగా బ్రహ్మమేతాను తానేబ్రహ్మము అని అభేదభావముగల జ్ఞానులకు తనలో ఐక్యమును కలిగించుచున్నాడు.) బ్రహ్మము వేరు తా నువేరు అని భేదభావముగలవారికి ఆపరబ్రహ్మము తనలో ఐక్యము గలి గించక వేరుగానే భేదరూపములుగలవాడుగానే తోచుచున్నాడు.

## ఐక్య బోధ.

---

శ్రుతి॥ అవ్యక్త-లేశాజ్ఞానాచ్ఛాదిత-పారమార్థిక-జీవస్య। తత్త్వమ స్యాది-వాక్యాని-బ్రహ్మైకతాం-జగుః॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ ఓ ఆంజనేయా! ఈలోకమందు వసించు మనుష్యుల మొదలుకొని సకలమైన జంతువులున్ను జీవులు అనియే చెప్పబడును పరబ్రహ్మముయొక్క ప్రతిబింబమగు ఈజీవుడు అవ్యక్తశక్తి యనః ...నే కప్పబడియున్నాడు. ఇట్టిజీవుడు బ్రహ్మైక్యమును వ

ధించునట్టి తత్వమస్యాది మహావాక్యవిచారణ చేయుటవలన జననమరణమ్ములులేనివాడై బ్రహ్మైక్యమను ముక్తిని బొందునుగాని ఇతరములైన్న వానివలన పొందఁజాలఁడు. [illegible] (తత్వమసి) అనగా జీవుడవగు నీవు ఆపరబ్రహ్మమే అగుచున్నావు, అనియర్థము.

శ్రుతి॥ పరజీవోపాధీ-మాయావిద్యే-విహాయ । తత్వంపద-లక్ష్యం ప్రత్యగభిన్నం-బ్రహ్మ-తత్వమసీతి॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ మాయాప్రతిబింబమగు ఈశ్వరునికి అధిష్ఠానమై సాక్షిగానుండు చైతన్యమే పరమాత్మ అనబడును. అంతఃకరణ ప్రతిబింబమగు జీవునకు అధిష్ఠానమై సాక్షిగానుండు చైతన్యమే ప్రత్యగాత్మ అనబడును, ఒక్క ఆకాశమే ఘటోపాధివలన ఘటాకాశమనియు, మఠోపాధివలన మఠాకాశమనియు,గృహోపాధివలన గృహాకాశమనియు గోపురోపాధవలన గోపురాకాశమనియు, నానావిధములుగా చెప్పబడునట్లు, పరబ్రహ్మమగు ఆత్మ ఒక్కడే ఈజీవజంతువుల శరీరములందు వసించుటవలన ప్రత్యగాత్మయనియు, బ్రహ్మరుద్రేంద్రాది దేవతా శరీరములందు వసించుటవలన పరమాత్మయనియు చెప్పబడును. మహాకాశమే ఘటాకాశమైనట్లున్ను,ఘటాకాశమే మహాకాశమైనట్లున్ను ప్రత్యగాత్మయేపరమాత్మ గాను,పరమాత్మయేప్రత్యగాత్మగాను సమరసైక్యమునుబొందుచుండును. ఈరెంటికిన్ని సత్యజ్ఞానానందలక్షణములు సహజములుగాన, ఇవి ఏకమేగాని ఎంతమాత్రమున్ను భేదములేదు. అయితే మేఘజలమునందు ప్రతిబింబించిన ఆకాశమున్ను, ఘటజలమునందు ప్రతిబింబించిన ఆకాశమున్ను కల్పితంబులగుటవలన వీటికి ఐక్యముగలుగఁజాలదు. అట్లు మాయయందు ప్రతిబింబించిన ఈశ్వరుడున్ను,అంతఃకరణమునందు ప్రతిబింబించిన జీవులున్ను ప్రతిబింబములగుచు మిథ్యాస్వరూపంబులగుటవలన, ఈరెంటికిన్ని ఐక్యము గలుగఁజాలదు, కాబట్టి ఓ అంజనేయా! నీకుజీవస్వరూపంబు కల్పితంబు, [illegible] ఆత్మస్వరూపమే నీనిజస్వరూపముగాన, నీవుజీవుడవను భ్రాంతిని విడిచిపెట్టి నీవు ప్రత్యగాత్ముడవనియు, ప్రత్యగాత్మస్వరూపుడవగు నీవే పరమాత్మ

అనియు, సమరసైక్య భావమును బొందుము.

శ్రుతి॥ మాయావిద్యే-విహాయైవ-ఉపాధీ-పరజీవయోః । అఖండ-సచ్చిదానందం-పరం-బ్రహ్మ-విలక్ష్యతే॥ అధ్యాత్మోపనిషత్తు.

తాత్ప॥ ఓ ఆంజనేయా ! మాయాప్రతిబింబమగు ఈశ్వరునికిన్ని అంతఃకరణ ప్రతిబింబమగు జీవునకున్ను జననమరణ సుఖదుఃఖాది సకలవికారములున్ను ఉపాధులున్ను గలవుగాని, ప్రత్యగాత్మ పరమాత్మలకు ఏవికారములులేక,అఖండ సచ్చిదానందమయములుగానున్నవిగాన,నీవు జీవుడవను భ్రాంతిని విడిచి ప్రత్యగాత్మవనుచు నిశ్చయించి, ప్రత్యగాత్మస్వరూపుడవగునీవే పరమాత్మయని ఐక్యభావమునుపొందుము.

శ్రుతి॥ తత్సత్యం-స-ఆత్మా-తత్వమసి-శ్వేతకేతో॥ ఛాందోగ్యోపనిషత్తు.

తాత్ప॥ ఆత్మస్వరూపుడవగు నీవే పరబ్రహ్మము.— ఆ పరబ్రహ్మమే ఆత్మస్వరూపుడవగు నీవు. ఇది సత్యము.—

శ్రుతి॥ తత్వమసి-త్వంతదసి- త్వంబ్రహ్మాసి-అహంబ్రహ్మాస్మీ-త్యనుసంధానం - కుర్యాత్॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ ఆత్మస్వరూపుడవగు నీవే బ్రహ్మము, ఆపరబ్రహ్మమే నీవు. కాబట్టి సకల తలంపులుమానిఆత్మస్వరూపుడనగునేనేబ్రహ్మమని సదా ఆత్మానుసంధానముచేయుచుండుము.

శ్రుతి॥ యత్పరం-బ్రహ్మ-సర్వాత్మా- విశ్వస్యాయతనం - మహత్। సూక్ష్మాత్సూక్ష్మ- తరం-నిత్యం। తత్వమేవ-త్వమేవ-తత్ ॥ కైవల్యోపనిషత్.

తాత్ప॥ ఏది, ఈప్రపంచమునకు ఆధారమై, సూక్ష్మాతిసూక్ష్మమై నిత్యమై, సర్వాత్మ స్వరూపమైయున్నదో,అపరబ్రహ్మమేనీవు,నీవే అది

శ్రుతి॥ జాగ్రత్స్వప్న-సుషుప్త్యాది-ప్రపంచం-యత్ప్రకాశతే। తత్ బ్రహ్మాహమితి-జ్ఞాత్వా-సర్వబంధైః-ప్రముచ్యతే ॥ కైవల్యోపనిషత్తు.

తాత్ప॥ జాగ్రత, స్వప్నము,సుషుప్తి,అనెడి అవస్థాత్రయ సాక్షిగ నుండు ఆత్మయే పరబ్రహ్మము, కాబట్టి ఆత్మ స్వరూపుడనగు నేనే ప

శ్రుతి॥ తత్-బ్రహ్మ-స-ఆత్మా॥ తైత్తిరీయోపనిషత్తు—.

తాత్ప॥ ఆబ్రహ్మమే అంతఃకరణసాక్షిగా ఆత్మస్వరూపముగానున్నది.

శ్రుతి॥ ప్రజ్ఞానమేవ-తత్-బ్రహ్మ-సత్య-ప్రజ్ఞాన - లక్షణం। ఏవం-బ్రహ్మ-పరిజ్ఞానాదేవ-మర్త్యోఽమృతో-భవతి॥ మహోపనిషత్తు.

తాత్ప॥ దేహేంద్రియాంతఃకరణ తద్వృత్తులను, అవస్థాత్రయమును, ఎవిరెఱుగుచు కేవల జ్ఞానస్వరూపముగానున్నదో, అదే ఆత్మ. ఇట్లు తెలుసుకొన్నవాడు నిత్యముక్త పరబ్రహ్మస్వరూప మగుచున్నాడు.

శ్రుతి॥ యదాహ్యేవైష- ఏతస్మిన్నదృశ్యే ఽ నాత్మ్యే ఽ నిరుక్తే- నిలయనేఽభయం-ప్రతిష్ఠాం-విందతే॥ అథ- సోఽభయం-గతో-భవతి॥ యదాహ్యేవైష-ఏతస్మి-న్నుదర-మంతరం-కురుతే। అథ-తస్య-భయం-భవతి॥ తైత్తిరీయోపనిషత్తు.

తాత్ప॥ అదృశ్యమును, లింగశరీర రహితమును, అవాఙ్మానస గోచరంబును, మాయాతీతమును అగు పరబ్రహ్మమును ఆత్మస్వరూపముగానెరిగి, ఏకాగ్రచిత్తముతో ఆత్మధ్యానమును చేయుచుండునట్టివాడు (అభయమును) అనగా అపరబ్రహ్మైక్యమును పొంది నిత్యముక్తుడగుచున్నాడు.—ఎవడు బ్రహ్మమువేరు ఆత్మవేరని భేదముగా జూచుచున్నాడో, వాడు జననమరణ సంసారసాగరమునందు మునిగి దుఃఖించును.

శ్రుతి॥ యఏవం-వేదాహం-బ్రహ్మాస్మీతి। స- ఇదం- సర్వం- భవతి। బృహదారణ్యోపనిషత్తు —

తాత్ప॥ ఎవడు ఆత్మస్వరూపుడనగు నేనే బ్రహ్మమని తెలుసుకొనుచున్నాడో, వాడు ఆ పరబ్రహ్మ స్వరూపుడగుచున్నాడు.

శ్రుతి॥ అయమాత్మా-బ్రహ్మ॥ మాండూక్యోపనిషత్తు.

తాత్ప॥ ఈశరీరమునఅంతఃకరణసాక్షిగానుండుఆత్మయే బ్రహ్మము.

శ్రుతి॥ త్వమేవాహం-న భేదోస్తి-పూర్ణత్వాత్-పరమాత్మనః॥ మండలబ్రాహ్మణోపనిషత్తు.

తాత్ప॥ ఓ అంజనేయా! నీవే నేను, నేనే నీవు, మనమిద్దరమున్ను సర్వపరిపూర్ణ పరబ్రహ్మమగు ఆత్మస్వరూపులమే. మనమిద్దరమున్ను ఏకపర

బ్రహ్మమే. మనకిద్దరికిని సత్యముగా యేయొక్క భేదమున్ను లేదుసుమా.

---

## ఓంకారనిర్ణయము.

శ్రుతి॥ సర్వేవేదా-యత్పదమామనంతి। తపాంసి-సర్వాణిచ-యద్వదంతి। యదిచ్ఛంతో-బ్రహ్మచర్యం-చరంతి। తత్తేపదం- సంగ్రహేణ - బ్రవీమ్యో-మిత్యేతత్॥ కఠోపనిషత్తు.

తాత్ప॥ ఋగ్యజు స్సామాదివేదములున్ను, సకలఉపనిషత్తులున్ను, ఏపరబ్రహ్మమును ప్రతిపాదించుచున్నవో, సకలమైన తపస్సులున్ను ఏపరబ్రహ్మమునుగురించి చెప్పబడియున్నదో, మరియు ఏపరబ్రహ్మ పదమును గోరినవారై లోకులు గురుకుల వాసము చేయుచున్నారో, అట్టి పరబ్రహ్మపదమును నీకు సంగ్రహించిచెప్పుచున్నాను. అదేఓంకారము.

శ్రుతి॥ అష్టాంగంచ-చతుష్పాదం-త్రిస్థానం-పంచదైవతం।ఓంకారం యో-నజానాతి। నధవేత్-బ్రాహ్మణస్తు-సః। ధ్యానబిందూపనిషత్తు.—

తాత్ప॥ ఎనిమిది అంగములు, నాలుగుపాదములు, మూడుస్థానములు, అయిదు దేవతలున్ను గూడినదే ఓంకారము అనబడును. ఈశ్వర తత్వమందు మాయాప్రతిబింబము, మహాకారణ మనబడునును. ఈశ్వరునియొక్క స్థూల సూక్ష్మకారణములనెడి శరీరములు మూడున్ను, మాయాప్రతిబింబమగు మహాకారణ శరీరమున్నుగూడి ఈనాలుగు శరీరములున్ను ఈశ్వరసంబంధములైనవి. జీవతత్వమందు అంతఃకరణప్రతిబింబమే మహాకారణమనబడును. జీవునియొక్క స్థూల సూక్ష్మకారణములనెడి శరీరములు మూడున్ను, అంతఃకరణ ప్రతిబింబమగు మహాకారణశరీరమున్ను గూడి, ఈనాలుగు శరీరములున్ను జీవసంబంధములైనవి. (శ్రీ) ఈజీవేశ్వరులయొక్క శరీరములు మొత్తము, ఎనిమిదిన్ని, ఎనిమిది అంగములనబడును.

### —*త్రిస్థానముల వివరము.*—

| | | | |
|---|---|---|---|
| 1-హకారము-శివస్థానము | 1-సూర్యుడు | 1-నాదము | 1-అకారము |
| 2-సకారము-శక్తిస్థానము | 2-చంద్రుడు | 2-కళ | 2 ఉకారము |
| 3-బిందువు-శివశక్తి ఐక్య | 3-అగ్ని | 3-బిందువు | 3-మకారము |

☞ ఇవియన్నియు త్రిస్థానములనబడును.

—✽ చతుష్పాదములు. ✽—

1-భ్రూమధ్యము, 2-కంఠము, 3-హృదయము, 4-నాభి.

1-జాగ్రత, 2-స్వప్నము, 3-సుషుప్తి, 4-తుర్యము.

1-అవిద్యాపాదము. 2- సువిద్యాపాదము. 3 - ఆనందపాదము. 4-తురీయపాదము.

☞ ఇవియన్నియు చతుష్పాదములనబడును —

—✽ పంచదైవతములు. ✽—

1 - బ్రహ్మ, విష్ణు, రుద్ర, మహేశ్వర, సదాశివులు.= ఈ అయిదున్ను పంచభూత అధిదైవతములు.

2 - పృథివి, అప్పు, తేజస్సు వాయువు, ఆకాశము.= ఈ అయిదున్ను పంచభూతములు.

3 - న మ వా య.= ఈ అయిదున్ను పంచాక్షరములు.

4 - ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములు.= ఈ అయిదున్ను పంచప్రాణములు.

☞ ఇవియన్నియు పంచదైవతములనబడును.

ఓ ఆంజనేయా! పైచెప్పినవన్నియుగూడి ఓంకారమని చెప్పబడును. ఇవియన్నియు ఈ దేహమందేయున్నవిగాన దేహమే ఓంకారముసుమీ.

ఓంకార షోడశకళలు.

---

మరియు ఈ ఓంకారము-౧౬- విధములుగా భాగింపబడుచున్నవి. ఎట్లనగా, జాగ్రతలో జాగ్రత, జాగ్రతలో స్వప్నము, జాగ్రతలోసుషుప్తి, జాగ్రతలోతుర్యము, స్వప్నములోజాగ్రత, స్వప్నములో స్వప్నము, స్వప్నములోసుషుప్తి, స్వప్నములోతుర్యము, సుషుప్తిలోజాగ్రత, సుషుప్తిలోస్వప్నము, సుషుప్తిలోసుషుప్తి, సుషుప్తిలో తుర్యము, తుర్యములోజాగ్రత, తుర్యములోస్వప్నము, తుర్యములోసుషుప్తి,

తుర్యములో తుర్యము. అని ఓంకారము-౧౬-విధములు.

(1)జాగ్రతలో జాగ్రత.—ఏదైననొక సంగతి వినునప్పుడుగాని, లేక వేదాంతశ్రవణము చేయునప్పుడుగాని అడుగదగిన విషయములన్నియు చక్కగా అడిగి తెలుసుకొని మరచిపోకుండా యుండుట. (2) జాగ్రతలో స్వప్నము.—ఏదైననొక గ్రంథమును చదువునప్పుడు, లేక వినునప్పుడు పరామరికగానుండుటచేత ఆవిషయములు కొంచము జ్ఞాపకముండి కొంచము జ్ఞాపకములేకపోవుటవలన ఇతరులకు చక్కగా చెప్పుటకు వల్లపడక మరచిపోవుట. (3) జాగ్రతలో సుషుప్తి.— ఎవరైనా వేదాంతశాస్త్రమును చెప్పుచుండగా, అది వినవలయునని కూర్చొనియుండియు, మనస్సును ఆవిషయములయందు నిలుపక వేరే ఎక్కడనో కలవరముగానుండుటవలన, విన్న సంగతి ఇట్టిదని జ్ఞప్తిలేక బొత్తిగా మరచిపోవుట. (4) జాగ్రతలో తుర్యము.—గురువులవారివద్ద వేదాంతశ్రవణము చేయుటవలన తత్వజ్ఞానముగలిగి ఏకాంతస్థలమునందు కూర్చుకొని గురుడు చెప్పిన విషయములన్నియు చింతించుచుండుట. (5) స్వప్నములో జాగ్రత.—కలగని లేచి తాను కలలోగన్న విషయములన్నియు మరవకుండా యుండుట. (6) స్వప్నములో స్వప్నము.—కలగని లేచి కలలోగన్న పదార్థములు కొన్ని జ్ఞాపకముండి కొన్ని జ్ఞాపకములేకపోవుట. (7) స్వప్నములో సుషుప్తి.—కలగని లేచి ఆకలలోగన్న విషయములన్నియు బొత్తిగా మరచిపోవుట. (8) స్వప్నములో తుర్యము.—స్వప్నమువలన గలిగిన మేలుకీడులు విచారించి, సంతోషింపక దుఃఖింపక, ఇవియన్నియు మనోవ్యాపారములని నిశ్చయించుకొని బ్రహ్మవిచారమునుండి తొలగకుండుట.(9)సుషుప్తిలో జాగ్రత.—నిద్రించిలేచి అనిద్రసుఖమిట్టిదని ఇతరులతో చెప్పుట. (10) సుషు లోస్వప్నము.— సుఖముగా నిద్రించిలేచి ఆనిద్రసుఖమిటిదని తో యు తోచకుండుట.(11) సుషుప్తిలోసుషుప్తి.— నిద్రించిలేచి ఆని సుఖమిట్టిదని బొత్తిగా తోచకుండుట. (12)సుషుప్తిలోతుర్యము.—సుఖముగానిద్రించిలేచి ఈనిద్రావస్థ అజ్ఞానవిషయమేగాని, దీనికి

క్షియై సత్యజ్ఞానానంద ఆత్మయైన నాకిది విషయముగాలేదని తెలిసికొనుట. (13) తుర్యములోజాగ్రత.—బ్రహ్మనిష్ఠయందుండునప్పుడు జాగ్రతావస్థయందలి వ్యాపారములైన ఆకలిదప్పులు తోచి ప్రపంచవృత్తిగలుగుట. (14) తుర్యములోస్వప్నము.—బ్రహ్మనిష్ఠయందుండునప్పుడు ఆకలిదప్పులు తోచియు,* ప్రపంచవృత్తి కలిగియు, కలుగకుండుట. (15) తుర్యములోసుషుప్తి.—బ్రహ్మనిష్ఠయందు ఏవికల్పములు లేక స్థిరముగానుండుట. (16) తుర్యములోతుర్యము.—పైజెప్పిన-౧౫-భేదములు ఏవిన్నిలేక, అఖండ సచ్చిదానంద సర్వపరిపూర్ణ పరబ్రహ్మము తానేకాని, తనకంటెవేరుగాలేదని నిశ్చయజ్ఞానము గలిగి, తాను తానైయుండుట. ఈ పదియారవభాగమే అన్నిటికంటెను ఎక్కువైనస్థితి.(ఇంతకంటె ఎక్కుడు అనుభవములేదు. ఇట్లు పదియారు భాగములుగానుండు ఓంకారమే ప్రకృతి, లేక పరాపరబ్రహ్మమనబడును.)

శ్రుతి॥ ఓంకారప్రభవం-సర్వం-త్రైలోక్యం-సచరాచరం ॥ ధ్యానబిందూపనిషత్తు.

శ్రుతి॥ ఓమిత్యేతదక్షర-మిదంసర్వం-సర్వ-మోంకార-ఏవ॥ మాండూక్యోపనిషత్తు.

తాత్ప॥ ఓ ఆంజనేయా! ఓంకారమునుండియే త్రిలోకములున్ను, సచరాచరములు సర్వమున్ను బుట్టెను; కాబట్టి ఓంకారమే సర్వము. నీదేహమున్ను జీవుడవగు నీవున్ను ఓంకారస్వరూపముగా దలంపుము.

## హంసభావము.

---

శ్రుతి। ఊర్ధ్వంప్రాణ-మున్నయత్యపానం - ప్రత్యగస్యతి । మధ్యేవామన-మాసీనం-విశ్వేదేవా-ఉపాసతే॥ కఠోపనిషత్తు.

తాత్ప॥ ఓ ఆంజనేయా ! ఓంకారమే సకల జీవజంతువులకున్ను శరీరముగానున్నది. ఇట్టి శరీరములందు ప్రాణవాయువు రేచకరూపంబున ఊర్ధ్వముగా వ్యాపించి సంచరించుచుండును. అపానవాయువు పూరకరూపంబుగా అధోముఖంబుగా వ్యాపించి సంచరించు

చుండును. ఈశెంటికి మధ్యనుండు ఆత్మను, బ్రహ్మరుద్రేంద్రాది దేవత లు సదా ఉపాసించుచుందురు, ఈ ఆత్మయే (హంస)అనిచెప్ప బడును. ఇతనివల్లనే ప్రాణాపానంబులు సంచరించుచుండును.

శ్రుతి॥ ప్రాణాపాన-వశోజీవో-హ్యధశ్చోర్ధ్వం-ప్రధావతి। వామ దక్షిణ మార్గేణ-సంచలత్వాన్నదృశ్యతే। ఆక్షిప్త-భుజదండేన - యథోచ్చలతి-కందుకః। ప్రాణాపాన - సమాక్షిప్త-స్తద్వజ్జీవో- నవిశ్రమేత్। అపానాత్కర్షతి-ప్రాణో-పానః-ప్రాణాచ్చ-కర్షతి। ఖగర జ్జు-వదిత్యేతద్-యోజానాతి-సయోగవిత్ (హకారేణ- బహిర్యాతి - సకారేణ-వసేత్పునః। హంసహంసే-త్యమంత్రం- జీవో-జపతి-సర్వదా। ధ్యానబిందూపనిషత్తు.

తాత్ప॥ ఓ అంజనేయా! బిడ్డలు చేతితో ఎగరవేయబడిన చెండు పైకిక్రిందికి ఎగురుచు పడుచుండునట్లు, ప్రాణాపాన వాయువులు రెండున్ను ఈదేహమధ్యంబున షడాధారంబులందు పైకిక్రిందికి ఎక్కుచుదిగుచు ప్రతిదినమున్ను-౨౧౬౦౦-సార్లు రేచకపూరక రూపంబున నాసికాద్వారములగుండా ద్వాదశాంగుళ అష్టాంగుళములవరకు బయిటికి వచ్చుచు, మరల లోపలికి బోవుచు, ఈ ప్రకారముగ ఇడయనెడి సూర్యనాడినుండి పింగళయనెడి చంద్రనాడిమార్గంబుగాను పింగళయనెడి చంద్రనాడినుండి ఇడయనెడిసూర్యనాడి మార్గంబుగాను మారిమారి తిరుగుచుండును. ఒక త్రాటియందు కట్టబడిన పక్షిని అత్రాడు ఏప్రకారము లాగుచుండునో, అట్లు ఈరేచక పూరకంబులనెడ ప్రాణాపానంబులు దీనికి నడుమనుండు జీవుని పైకిక్రిందికి ఈడ్చుచుడును. ఈజీవుడు తద్వారా హంస కీలకంబగు (సోహం) అనెడి మంత్రమును తనకుతానే సదా జపించుచుండును. ఈరహస్యమును తెలిసినవారలే రాజయోగులుగాని తక్కినవారుగాజాలరు.

శ్రుతి॥ జ్ఞానాత్మస్వరూపం- పరమహంసమంత్రం - సముచ్చరేత్ ప్రాణినాం-దేహమధ్యేతు-స్థితోహంస-స్సదాచ్యుతః। హంసఏవ-పర సత్యం-హంసఏవతు-శక్తికం।హంసఏవ పరంవాక్యం- హంసఏవతు-

దిశం। హంసఏవ-పరోరుద్రః-హంసఏవపరాత్పరః॥ బ్రహ్మవిద్యోపనిషత్

తాత్ప॥ ఆత్మ సకలజంతువుల దేహమధ్యంబున హంసస్వరూపంబున నుండుచు-[శ్రుతి॥సోహ-మపాపో-విరజో-నిర్ముక్తః॥]-అనెడి తైత్తిరీయోపనిషత్తురీతిగాను—[శ్రుతి॥యోసా-వసౌ-పురుష-స్సోహమస్మి॥] అనెడి ఈశావాస్యోపనిషద్రీతిని-☞(సోహంసోహం) అనుచు, అవగానేనే బ్రహ్మము, బ్రహ్మమే నేను అనుచు, సదాతనకుతానే జపించుకొనుచుండును. బ్రహ్మవిష్ణుమహేశ్వరాదిదేవతాశరీరంబులందును ఈహంస సంచరించు చుండుటవల్లనే వారు జీవించియుందురు గాని, లేకున్న ప్రేతములుగానుందురు, కాబట్టి ఇదియే బ్రహ్మ, విష్ణు, శివుడు, శక్తి, అని చెప్పబడును. ఈ హంసయే సత్యస్వరూపుడు. ఇతడే పరాత్పరుడు, ఇతని పలుకే సోహము. ఇదే మంత్రములలోపల శ్రేష్ఠమైన మంత్రము, దీని రహస్యమే సోహంభావము. ఈ సోహంభావమే బ్రహ్మైక్యమును గలిగించుటకు కారణమైనది. ఇదే సద్గురుగోప్యము. ఇదియే నాలుగు మహావాక్యములయొక్క సారము. ఇదే అజపగాయత్రి. ఇదే మాన నిర్గుణ ఆత్మధ్యానము. ఇదే ఆత్మారామతారకము. ఈహంససూత్రమును తెలుసుకొన్నవారే నిజమైన బ్రాహ్మణులు. వీరే బ్రహ్మజ్ఞానులు. ☞ నానా దిక్కులందు పరుగెత్తి సంచరించు కోతిని పరుగెత్తిపోకుండా పట్టి, ఒక త్రాటితో కట్టి తీసుకొనివచ్చినట్లు, నానావిషయంబులందు విచ్చలవిడిగా వ్యాపించి తిరుగుచు భ్రమించుచుండెడి మనస్సును ఈ హంససూత్రమునందు కట్టివేసినయెడల, ఎక్కడికి పారిపోక అక్కడనే నెమ్మదిగా నుండునుగాని, వేరే యేయొక్క ఉపాయముల చేతను కట్టుబడి కుదురుపడదు.

శ్రుతి॥ నశిఖాం-వపనం-కృత్వా-బహిస్సూత్రం-త్యజేద్బుధః। బ్రహ్మసూత్ర-మిదం-జ్ఞేయం-సూత్రంనామ-పరంపదం। తత్సూత్రం - ధారయేద్యోగీ-సవిప్రో-వేదపారగః॥ బ్రహ్మోపనిషత్తు.

తాత్ప॥ శిరస్సున శిఖబెట్టుకొనుటవల్లను, జంధ్యము వేసుకొనుటవల్లను ఫలములేదు. బోడికొట్టుకొనుటవల్లను ఫలములేదు. మానవుఁ

చేచేయబడిన నూలుపోగులు జంధ్యములను వేసుకొనుటవలన బ్రాహ్మణుడుగాజాలడు. అయితే దేవనిర్మితంబగుచు పిపీలికాది బ్రహ్మపర్యంతము సర్వజీవులయందు ☞ ఈ హంససూత్రము వ్యాపించియున్నదిగాన, ఇదే నిజమైన జంధ్యమనియు బ్రహ్మసూత్రమనియు, జ్ఞానయజ్ఞోపవీతమనియు చెప్పబడును. దీని నెఱింగినవారే నిజమైన బ్రాహ్మణులు.

శ్రుతి॥ హంసహంసేతి-యోబ్రూయాత్। హంసోనామ-హరిశ్శివః। గురువక్త్రాత్తు-లక్ష్యతే-ప్రత్యక్ష-స్సర్వతోముఖం॥ బ్రహ్మవిద్యోపనిషత్తు.

తాత్ప॥ ఓ ఆంజనేయా! బ్రహ్మైక్య కారణంబగు ఈ హంసస్వరూప సంచారరహస్యంబును దెలిసి ధ్యానించు జ్ఞానులు హరిహరాది దేవతలతోడ సమానులగుచున్నారు. ఈ పరమపావనమైన హంసమార్గము సద్గురుకటాక్షముంబొందినవారికే తెలియునుగాని, తక్కిన వారికి ఎంతకష్టపడినను తెలియజాలదు. సనకసనందనాదులు, నారదుడు, వసిష్ట, పరాశర, వ్యాస, శుక, శౌనక, ఋభు, నిదాఘ, జడభరత, జనకమహారాజు మొదలైనవారు దీనిందెలిసినందువల్లనే బ్రహ్మస్వరూపులగుచు ముక్తులైరి. ఇదే నిజమైన తారకయోగము. దీనిందెలియ నేరక కొందఱు పంచాక్షరీ అష్టాక్షరీ మొదలగు మంత్రంబుల జపించుచు, భూచరి ఖేచరి మొదలగు పంచముద్రలంబట్టి చిక్కిశలుజూచుచు, దశవిధనాదంబులను వినుచుండుట తారకయోగమందురు. అది సరిగాదు. ఎట్లనగా.

శ్రుతి॥ గర్భజన్మ-జరామరణ-సంసార-మహద్భయాత్। సంతారయతి - తస్మాత్తారకం॥ అద్వయతారకోపనిషత్తు.

తాత్ప॥ జననమరణంబులనెడి మహాదుఃఖసాగరంబునుండి దాటించి మోక్షమునజేర్చునదే తారకమనబడును. తానేబ్రహ్మము, బ్రహ్మమే తాను, అని ఐక్యంబుగావించు ☞ ఈసోహంభావ ధ్యానమే జన్మమరణంబులులేని మోక్షమును బొందజేయునుగాని, పంచాక్షరీ మొదలగు మంత్రములున్ను భ్రూమధ్యంబునందలి చిక్కిశాదర్శనములున్ను దశవిధనాదంబులున్ను, తనకు అన్యముగా బ్రహ్మమొకటియున్నదనుట [illegible] అవి (నేనేబ్రహ్మము, బ్రహ్మమేనేను) అని ఐక్య

నంబు గావింపజాలదు గాన, అవియన్నియు నిజమైన తారకయోగంబుగా జాలదు. ఈపరమపావనమైన హంసమార్గమే నిజమైన తారకయోగంబని శ్రీరామచంద్రుండు నిజభక్తుండగు ఆంజనేయునికి (సోహమనెడి) హంసస్వరూపసంచారరహస్యంబు ప్రత్యక్షముగాబోధించెను.

మానస లక్షణము.

---

శ్రుతి॥ చిత్తం-సంజాయతే-జన్మ-జరామరణ-కారణం॥ ముక్తికోపనిషత్.

తాత్ప॥ ఆంజనేయా! మనస్సే జననమరణములు కలిగించుచుండును.

శ్రుతి॥ మనఏవ-మనుష్యాణాం-కారణం-బంధమోక్షయోః। బంధాయ-విషయాసక్తం। ముక్త్యై-నిర్విషయం-స్మృతం॥ శాట్యాయనీఉపనిషత్తు

తాత్ప॥ బంధమోక్షములకు మనస్సే కారణము. మనస్సు విషయాదులందు తగులుపడుటవలన బంధము ప్రాప్తించును. అట్లు తగులుపడకుండుటవలన మోక్షము ప్రాప్తించును.

శ్రుతి॥ అతస్సర్వం-జగత్-చిత్తగోచరం॥ మండలబ్రాహ్మణోపనిషత్తు

తాత్ప॥ మనస్సు తోచుటవల్లనే ప్రపంచము తోచుచుండును.

శ్రుతి॥ యథా-రసాశయే-ఫేనం-మథనాదేవ-జాయతే। మనోనిర్మథనాదేవ-వికల్పా-బహవ-స్తథా॥ త్రిశిఖీబ్రాహ్మణోపనిషత్తు.

తాత్ప॥ మజ్జిగపాలుమొదలగురసద్రవ్యములనుకవ్వముతోచిలుకుట వలన చలించి అందు నురుగులు పుట్టునట్లు, మనస్సుచలించిఆల్లాడుచుండుటవల్లనే నానావిధభేదములతోడ జగత్తు తోచి ద్వైతభ్రమ పుట్టును.

శ్రుతి॥ సహస్రాంకుర-శాఖాత్మా-ఫలపల్లవ-శాలినః। అస్య-సంసారవృక్షస్య-మనోమూల-మిదం-స్థితం। సంకల్ప-ఏవ-తన్మన్యే-సంకలోపశమేన-తత్। శోషయాశు - యథా- శోష మేతి-సంసార-పాదపః ముక్తికోపనిషత్తు.

తాత్ప॥ జననమరణములే స్వరూపముగాగల సంసారమనెడు వృక్షమునకు మనస్సే మూలము. ☞ (సంకల్పములే) అనగా నానావిధ తలంపులే, మనస్సునకు రూపముగానున్నది. కాబట్టి తలంపు

నశించితే మనస్సు నశించి సంసారవృక్షము తనకు తానే నశించును.

శ్రుతి॥ ఉపాయ-ఏకఏవాస్తి-మనస్స్వస్య-నిగ్రహే। మానవేభ్యు ఒయే-నాశో-మనో-నాశో-మహోదయః॥ ముక్తికోపనిషత్తు.

తాత్ప॥ సకల తలంపులను తలయెత్తకుండా చేయుటే, మనోనాశమునకు ముఖ్యమైన ఉపాయము.

శ్రుతి॥ మనసోహ్యున్మనీ-భావే-ద్వైతం-నైవోప-లభ్యతే। యదాయాత్యున్మనీ-భావ।స్తదా-తత్పరమం-పదం। పైంగలోపనిషత్తు.

తాత్ప॥ ఆంజనేయా!మనస్సే మహామాయ అనబడును. దీనివల్లనే నీవు, నేను, జీవుడు, దేవుడు, జగత్తు, బంధము, మోక్షము, మొదలగు సకల ద్వైత భేదములు తోచును. ఈ మనస్సే నిత్యముక్త పరబ్రహ్మము తాననుటను మఱపించి, దేహమే తానను భ్రమను పుట్టించును. ఈమనస్సే, బుద్ధి, చిత్తము, అహంకారము, కామ, క్రోధలోభాది గుణములుగా మారుచు లోకులను బాధించుచుండును. ఇట్టి చండాల మనసు బ్రహ్మనిష్ఠయందు లయించినయెడల ప్రపంచము తోచదు, ద్వైతభ్రాంతి పుట్టజాలదు, తత్క్షణమే సర్వము తానైన బ్రహ్మానుభవము గలుగును.

శ్రుతి॥ సుషుప్తౌ-సుఖమాత్రాయాం-భేదః-కేనావలోకితః। చిత్తమూలో-వికల్పోయం-చిత్తాభావే-నకశ్చన। అతశ్చిత్తం-సమాధేహి-ప్రత్యగ్రూపే-పరాత్మని॥ అధ్యాత్మోపనిషత్తు.

తాత్ప॥ మనస్సే మహామాయ అనబడును. ఇది నిద్రయందు లయించియుండుటవల్లనే ప్రపంచము తోచుటలేదు. అయితే నిద్రవిడిచి మేలుకొనగానే మనస్సు మరల తోచుటవలన జగత్తు తోచుచుండును. కాబట్టి ఈమనస్సు బ్రహ్మనిష్ఠయందు లయింపజేసితివేని ప్రపంచము తోచక, ద్వైతము నశించి సర్వము తానైనట్టి బ్రహ్మసాక్షాత్కారము గలుగును. అనియిట్లు చెప్పగానే ఆంజనేయుండు స్వామీ రామచంద్రా మనస్సు నిద్రయందే లయించి ప్రపంచము తోచకుండా పోవుచుండగా, మరల బ్రహ్మనిష్ఠయందు లయించునట్లు ఏల అభ్యాసము చేయవలయుననగా శ్రీరామచంద్రుండు ఇట్లనియె.

శ్రుతి॥ సుషుప్తి-సమాధ్యో-ర్మనోలయా-విశేషేపి-మహ - దస్త్యర్థయో-ర్భేదః। తమసి-లీనత్వాత్। ముక్తి-హేతుత్వా భావాచ్చసమాధౌ మృదిత-తమోవికార-తదాకారా-కారిత-అఖండాకార- వృత్త్యాత్మక-సాక్షిచైతన్యే -ప్రపంచలయ- స్సంపద్యతే॥ మండలబ్రాహ్మణోపనిషత్తు.

తాత్ప॥ ఆంజనేయా! నిద్రయందు మనస్సు అజ్ఞానమను అంధకారమునందు లయించుటవలన, తడిభూమియందు పూడిన విత్తనము లయించి మరల మొలకలెత్తునట్లు, మరల జాగ్రతావస్థయందు మనస్సు లోచుచుండును. మరియు నిద్రయందు ఆమనస్సుతోడ జీవుడు అజ్ఞానమందు అణగి అజ్ఞానియగుచు తానేబ్రహ్మమని తెలియక తన్నుమఱచి, అంధకారమగు పాడుబావిలో పడిన గ్రుడ్డివానివలె పడియుండును. అందువలన జీవుడు ముక్తిపొందజాలడు. అయితే బ్రహ్మనిష్ఠయందు మనస్సు జ్ఞానాగ్నియందు లయించుటవలన, అగ్నిలోపడిన విత్తనము మరల మొలకలెత్తక నశించునట్లు, ఆమనస్సు నశించును, కాబట్టి బ్రహ్మనిష్ఠజేయునట్టి జ్ఞానికి తాను జీవుడను ద్వైతభ్రాంతి నశించి, ప్రపంచము నశించి, తాను కేవల సాక్షిమాత్ర స్వయంప్రకాశ పరబ్రహ్మముగానుండును. కాబట్టి నిద్ర, సమాధి, ఈరెంటికిన్ని మిక్కిలి భేదములున్నది సుమా. అనిచెప్పగా ఆంజనేయుండు స్వామీ రామచంద్రా బ్రహ్మనిష్ఠయందు మనస్సు నశించునని సెలవిచ్చితిరి అట్లయితే ఆబ్రహ్మనిష్ఠను సాధించు జ్ఞానులు నిష్ఠలోనేయుండక మరల ప్రపంచజ్ఞప్తి గలిగి నిష్ఠవిడిచిలేచి, నానావ్యాపారములు జేయుచును, శిష్యులకు ఆత్మబోధ మొదలైనవి చేయుచునున్నారు. మనస్సు ఉండియే కదా ఇవియన్నియు చేయుచునున్నారు. వారికి మనస్సు నశించినదని ఎట్లు చెప్పవచ్చును అని అడుగగా, అతని సూక్ష్మబుద్ధికి శ్రీరామచంద్రుండు మిక్కిలి సంతోషించి, ఆంజనేయా నీవు మిగుల బుద్ధిశాలివి, ఇట్లు ప్రశ్నచేసి సందేహనివారణ జేసుకొన్నవారే ముక్తులుగాని, తక్కినవారు ముక్తులుగా జాలరు. ఇక జాగ్రతగా వినుమనిఇట్లనియె.

శ్రుతి॥ ద్వివిధ-శ్చిత్తనాశో స్తి-సరూపో-రూప-ఏవచ। జీవన్ముక్తా-

సరూపస్యాత్-అరూపో-దేహముక్తిగః॥ ముక్తికోపనిషత్తు.

తాత్ప॥ ఆంజనేయా! సరూప మనోనాశమనియు,అరూప మనోనాశమనియు, రెండువిధములుగలవు. జీవన్ముక్తునియందు సరూపమనోనాశమున్ను విదేహముక్తునియందు అరూపమనోనాశమున్నుగలుగును.

శ్రుతి॥ చిత్తనాశాభిదానం-హి- యథాత్రే-విద్యతే । పునః-మైత్ర్యాదిభి-ర్గుణై ర్యుక్తం-శాంతిమేతి-నసంశయః।భూయో-జన్మ- వినిర్ముక్తం-తస్య-మనః।సరూపోసౌ-మనోనాశో-జీవన్ముక్తస్య-విద్యతే॥ముక్తికోప

తాత్ప॥ అహంకార మమకారములు, సంకల్పవికల్పములున్ను మనోవికారము లనబడును. ఇవియెల్ల నశించి మనస్సు నిర్వికారముగా కర్తృత్వశూన్యమై, జీవకారుణ్యము మైత్రి మొదలగు సద్గుణములు గలిగి పరమశాంతిని బొందియుండుటే, సరూప మనోనాశమనబడును. అగ్నియందు కాలిన గుడ్డమడత రూపముతోడ కనబడుచున్నను, ఎత్తి కట్టుకొనుటకు ఉపయోగపడనట్లు బ్రహ్మనిష్ఠాపరులైన జ్ఞానులకు మనస్సు తోచుచు వారు సకలకార్యములు చేయుచున్నను, వారి మనస్సు జ్ఞానాగ్నియందు దగ్ధమైయుండుటవలన నిర్వికారమై కర్తృత్వశూన్యమైయుండును. కాబట్టి అది సరూపమనో నాశమును బొందియుండును. ☞ అందువలన వారికి పునర్జన్మములు లేకపోవును.

శ్రుతి॥ ప్రపంచస్య-మనఃకల్పితత్వాత్-తతోభేదా-భావాత్ । కదాచిద్బహిర్గతేపి-మిథ్యాత్వభావాత్ । సకృద్విభాత- సదానందానుభవైక-గోచరో-బ్రహ్మవిత్తదేవ-భవతి॥ మండల బ్రాహ్మణోపనిషత్తు.

తాత్ప॥ ఒకానొక జారస్త్రీ తనపురుషునితోడ భోగించుచున్నను దానిమనస్సు మాత్రము జారపురుషునియందే నిల్పి ఆదేజ్ఞప్తిగానుండునట్లు బ్రహ్మనిష్ఠను మనోలయముచేసి బ్రహ్మానందముగానుండు జ్ఞానులు మరల నిష్ఠనుండిలేచి మనస్సుతోచి ప్రపంచమున సకల వ్యవహారములు చేయుచున్నను, ఈజగత్తు మనోకల్పితంబగుటవలన స్వప్నమువలె మిథ్యయని ధృఢనిశ్చయము గలిగి, తామే బ్రహ్మమని తదేకధ్యానముగానుందురుగాన, వారికి జగత్తు తోచుచున్నను దోషములేదు సుమీ.

శ్రుతి॥ అరూపశ్చ-మనోనాశో-వైదేహీ-ముక్తిగో-భవేత్॥ ముక్తికో

తాత్ప॥ అరూపమనో నాశమనగా కాలిన గుడ్డమడత చేతితోన లిపి ఊదినట్లయితే రూపులేక ధూళిగా ఎగిరిపోవునట్లు, మనస్సు రూపులేక భ్రాంతిగా నశించుట. ☞ ఇది విదేహముక్తియందుగలుగును, ఎట్లనగా, ఘటము పగిలినంతనే ఘటాకాశము మహాకాశమందు కలిసి ఏకమైపోవునట్లు, ప్రారబ్ధము నశించినంతనే జ్ఞానికి మనస్సు మొదలగు ౨౪-తత్వములున్ను దేహత్రయమున్ను రూపులేక భ్రాంతిగా నశించి, బ్రహ్మైక్యమగుచున్నాడుగాన, ఇదే అరూప మనోనాశమనబడును,

శ్రుతి॥ సర్వం-బ్రహ్మేతి-సంకల్పాత్-ముచ్యథా-న్ముచ్యతే-మనః। కృశోహం-దుఃఖ-బద్ధోహం-హస్త-పాదాదివానహం - ఇతిభావనా రూపేణ-వ్యవహారేణ-బధ్యతే॥ మహోపనిషత్తు.

తాత్ప॥ సమస్తము బ్రహ్మమే; ఆబ్రహ్మమే ఆత్మగాన, ఆత్మస్వరూపుడనగు నేనే బ్రహ్మము, నాకంటె అన్యముగా ఏదిన్నిలేదు, నేనే సర్వము, అని దృఢనిశ్చయముగలిగి తాను బ్రహ్మాకారముగానుండుటవలన మనస్సు తనకుతానే నశించును. నేను కృశుడను, నేనుదుఃఖిని, నేను కాళ్ళుచేతులు మొదలగు అవయవములు కలవాడను, నేనుజీవుడను, అను వ్యవహారము గలిగినయెడల మనస్సు నశించదు. ☞ అది నశింపకుండిన, జననమరణములు గలుగుట తప్పదు.

శ్రుతి॥స్వాత్మన్యేవ-సదా-స్థిత్వా-మనో-నశ్యతి-యోగినః॥అధ్యాత్మో

తాత్ప॥ దేహాది ప్రపంచము సర్వమున్ను, వీటిని ఎరుగుచుండేడు జీవుడున్ను ☞(నేతి-నేతి) నేనుకాను నేనుకానని విడిచిపెట్టి (ప్రజ్ఞానం-బ్రహ్మ) అనుశ్రుతిరీతిని, ఇన్నిటినెరుగుచుండెడి ☞ శుద్ధతెలివియే బ్రహ్మముగావున, అట్టి తెలివియే తానని తెలిసి, సకలతలంపులుమఱచి, తాను శుద్ధతెలివిమాత్రుడై స్వానుభవానందనిష్ఠను సాధించుటవలన మనస్సు తనకుతానే నశించును,

శ్రుతి॥ యచ్చిత్తం-తేనైష-ప్రాణమాయాతి- ప్రాణ-స్తేజసాయుక్తః। సహాత్మా-యథా-సంకల్పితం-లోకం-నయతి॥ ప్రశ్నోపనిషత్తు

తాత్ప॥☞ మరణకాలమున ఏయేతలంపులు గలుగునో ఆతలంపుల కుతగినట్లే జన్మాదులు గలుగును. కావున జీవించియుండునప్పుడే సదా తానేబ్రహ్మమని బ్రహ్మభావమందుండెనేని ఈదృఢాభ్యాసముచే మరణకాలమున తానే బ్రహ్మమను తలంపుగలిగి అంత్యమున బ్రహ్మస్వరూపుడగును.

శ్లో॥ నహి ప్రమాణం-జంతూనా-ముత్తరక్షణ-జీవితం। చరమశ్వాస-వేళాయాం-యత్కృతం-తత్-సదా-కురు॥

తాత్ప॥ లోకమునందలి సకలజనులున్ను ఇంక పైక్షణమునందు స్థిరముగా జీవించియుండగలరని తలచుటకు సాధ్యపడదు. ఎప్పుడో తనకు తెలియకనే ఉన్నట్లుండి మరణము ప్రాప్తించి ప్రాణములు లేచిపోవును. కాబట్టి ఈదేహమున ఉఛ్వాస నిశ్వాసము లుండునప్పుడే ☞ ప్రతిశ్వాసమున్ను మరణకాలమందలి అంత్యశ్వాసముగా దలంచి సదా (అహంబ్రహ్మాస్మి) అని బ్రహ్మానుసంధానమే చేయుచుండవలయును,

## బ్రహ్మ సాక్షాత్కారము.

---

శ్రుతి॥ అహంమమేతి-యోభావో-దేహాక్షాదా-వనాత్మని। అభ్యాసోయం-నిరస్తవ్యో-విదుషా-బ్రహ్మనిష్ఠయా॥ అధ్యాత్మోపనిషత్తు.

తాత్ప॥ దేహమేనేను అనెడి అజ్ఞానమున్ను, నాకన్ను, నాముక్కు, నాదేహమనెడి దేహాభిమానమున్ను బ్రహ్మజ్ఞాని ముఖ్యముగా విడిచిపెట్టవలయును. దూషణభూషణ తిరస్కారములు కులగోత్రములు జాతినీతులు సుఖదుఃఖంబులు శరీరమునకేగాని, ఆత్మస్వరూపుడవగు నీకు ఎంతమాత్రమున్ను లేదు. అనగా ఆత్మస్వరూపుడవగు నీవు దేహముకాదు, స్త్రీవికావు, పురుషుడవుకావు. దేహమునకే కన్ను, ముక్కు, చెవులు, మొదలగు అవయవములుగలవు గాని, ఆత్మస్వరూపుడవగు నీవు అవయవములులేనివాడవు కేవల నిరాకారుడవు సుమా.

శ్రుతి॥ జ్ఞాత్వా-స్వం-ప్రత్యగాత్మానం-బుద్ధి-తద్వృత్తి-సాక్షిణం సోహమిత్యేవ-తద్వృత్త్యా-స్వాన్యత్రాత్మ-మతిం-త్యజేత్॥ అధ్యాత్మోప

తాత్ప॥ ఈదేహమును, మనస్సును, బుద్ధిని, దానివృత్తులను, జీవుని,

విజ్ఞానమెరుగుచున్నదో, అటే సర్వసాక్షియని ఆత్మయని బ్రహ్మమని, శుద్ధయెరుకయని, శుద్ధచైతన్యమని, ప్రజ్ఞానమని, శుద్ధతెలివియనియు, కూటస్థుడనియు అచలమనియు చెప్పబడును. అజ్ఞానమే నీవనుచు తన్మయముగానుండుము. దేహాదిప్రపంచము నీవుగావనుచు దృఢనిశ్చయము గలిగి వానియందలి భ్రాంతిలేక యుండుము.

శ్రుతి॥ దృష్టిం-బ్రహ్మమయీం-కృత్వా-పశ్యేత్-బ్రహ్మమయం-జగత్। సాదృష్టిః-పరమోదారా-ననాసాగ్రావ-లోకినీ॥ ద్రష్టృ-దర్శన-దృశ్యానాం-విరామో-యత్రవా-భవేత్। దృష్టి-తత్రైవ-కర్తవ్యా-ననాసాగ్రావ-లోకినీ॥ తేజోబిందూపనిషత్తు.

తాత్ప॥ ఓ ఆంజనేయా! దృష్టిని జ్ఞానమయంబుగా జేసి, జగద్రూపముగా పరిణమించియుండు కేవల సాక్షియగు బ్రహ్మమును దర్శింపవలయునుగాని, (నాసాగ్రమందు) అనగా దృష్టిని భ్రూమధ్యంబునందు నిలుపరాదు. (1) ఈప్రపంచంబును ఎరుగుచుండెడు జీవుడు ద్రష్టయనబడును (2) ఈ జీవసంబంధమగు చూపులే దర్శనమనబడును. (3) ఈజీవునిచే ఎరుగబడినవన్నియు, వీనిచూపులో కనబడినవన్నియు దృశ్యములనబడును. ఈ ద్రష్ట దర్శన దృశ్యములు మూడున్ను త్రిపుటి యనబడును. ఈత్రిపుటి ఆత్మకాదు. ఈత్రిపుటి విజ్ఞానస్వరూపమగు పరబ్రహ్మమునందుండి గలిగెనో, ఆపరబ్రహ్మమునందే లయించి, తానుతానుగా నుండవలయునుగాని, ముక్కుకొనయందు దృష్టిని నిలుపరాదు. అనగా నీదేహాది ప్రపంచము సర్వమును ఎరుగుచుండెడి (ప్రజ్ఞానమే) అనగా శుద్ధతెలివియే బ్రహ్మముగాన, నీవు ఆజ్ఞానమందే నిలిచి,అది నీవేయని తన్మయంబుగానేయుండవలయునని భావము.

శ్రుతి॥ యస్య-వాఙ్మనసీ శుద్ధే-సమ్యగ్గుప్తేచ-సర్వదా। సవై-సర్వమవాప్నోతి-వేదాంతోప-గతం-ఫలం॥ నారద పరివ్రాజకోపనిషత్తు.

తాత్ప॥ ఎవనియొక్క మనస్సు చంచలములేక, వాక్కు మౌనముగాను, ఇంద్రియములు స్వేచ్ఛగా విహరింపకను, పరిశుద్ధముగానుండునో, వాడే వేదాంతమునందు చెప్పబడిన ఆత్మానుభవమును పొందును.

అని ఈప్రకారము శ్రీరామచంద్రుండు కరుణాంతరంగుండై ఆంజనే

యునిం జూచి ఓ ఆంజనేయా నీవు ఇక సకలసందేహములనుమాని ఆత్మ స్వరూపుడవగు నీవే బ్రహ్మమని నీనిజస్వరూపంబుదర్శింపుమని చిన్ముద్రన భినయించి చూపినంతనే సూక్ష్మబుద్ధిగల ఆంజనేయుండు దృఢవైరాగ్యంబుతో సకలతలంపులు మఱచి తానుతానైన కేవల సాక్షిమాత్ర బ్రహ్మానంద నిష్ఠను చెలంగుచు, కొంతసేపటికి ప్రపంచజ్ఞప్తిగలిగి లేచి శ్రీరామచంద్రుని పాదకమలములమీద వ్రాలి, ఆనంద బాష్పములతో వారిపాదపద్మములకు అభిషేకంబుజేసి, లేచి నిలువంబడి చేతులు శిరస్సుమీదికెత్తి దండంబుజేయుచు, స్వామీ రామచంద్రా సద్గురుండును, భగవంతుండును నైన దేవరవారికి నమస్కారంబులు. దేవరవారి కృపా కటాక్షమువలన నానిజస్వరూపంబుదర్శించి పావనుండనైతినని పెక్కువిధములు గీర్తించుచుండగా శ్రీరామచంద్రుండు కరుణాంతరంగుండై ఆంజనేయునిం జేరదీసి, దగ్గర కూర్చుండ బెట్టుకొని చెప్పున దేమనగా, ఓ ఆంజనేయా మునుపుబోధించిన హంసధ్యానమే తారక యోగమనియు, సవికల్పసమాధియనియు, సంచారసమాధియనియు, చెప్పబడును. ఇప్పుడుదెల్పిన భావమే సహజామనస్కయోగమనియు, నిర్వికల్పసమాధిఅనియు, బ్రహ్మసాక్షాత్కారమనియుం జెప్పబడును. నీవు ప్రపంచ వ్యవహారములందుండునప్పుడు హంసధ్యానమనెడు సవికల్పసమాధియందును, ఏకాంతంబుననుండువేళ సహజామనస్కయోగమనెడి నిర్వికల్ప సమాధియందును ఆనందించుచుండుమని యిట్లనిరి.

## జ్ఞాన అష్టాంగములు.

శ్రుతి॥ దేహేంద్రియేషు-వైరాగ్యం - యమ-ఇత్యుచ్యతే. బుధైః అనురక్తిః-పరేతత్త్వే-సతతం-నియమ-స్మృతః । సర్వవస్తు-న్యుదాసీన-భావ-మాసనముత్తమం । జగత్-సర్వ-మిదం-మిథ్యా-ప్రతీతిః- ప్రాణ సంయమః । చిత్తస్య-అంతర్ముఖే-భావః-ప్రత్యాహారస్తు-సత్తమః । చిత్తస్య-నిశ్చలీభావో-ధారణా-ధారణం-విదుః। సోహం-చిన్మాత్ర-మేవే తి-చింతనం-ధ్యానముచ్యతే । ధ్యానస్య-విస్మృతిః-సమ్యక్సమాధి- రభి

ధీయతే॥ త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్తు.

తాత్ప॥ ఆంజనేయా! (1) దేహేంద్రియంబులందు వైరాగ్యము, అనగా ఇంద్రియంబులను దానిదాని యిష్టప్రకారము విడిచిపెట్టక జాగ్రతగానుండుట, ఇదే యమముఅనబడును. (2) సదా పరబ్రహ్మమునందు ప్రీయముగానుండుట, నియమము అనబడును. (3) సకలవస్తువులందును ఆశలేకుండుట ఆసనము అనబడును. (4) జగత్తుసర్వము స్వప్నమువంటి దనియు మిథ్యయనియు దృఢముగా తలంచుట, ప్రాణాయామము అనబడును. (5) చిత్తమును బాహ్యవ్యాపారములందు పోనియ్యక సదా అంతర్ముఖమున త్రిప్పుట, ప్రత్యాహారమనబడును (6) చిత్తమును చలింపక నిశ్చలముగానిలుపుట ధారణ అనబడును. (7) సత్యజ్ఞానానందమయమై, సర్వసాక్షిగానుండు పరబ్రహ్మమే నేను, నేనే ఆపరబ్రహ్మమనెడు (సోహంభావమే) ధ్యానము అనబడును. (8) ఆధ్యానమున్ను సకలతలంపులున్ను సకలదృశ్యములున్ను మఱచి, తానుతానై కేవలసాక్షిమాత్రముగానుండుట, సమాధి అనబడును. ఇవియే జ్ఞాన అష్టాంగములు. వీనివల్లనే (సద్యోముక్తి) అనగా ఈజన్మమందే ముక్తి కలదు, యోగాష్టాంగములు క్రమేణ జన్మాంతరంబున ముక్తిగలుగుటకు సాధనంబులుసుమీ.

జ్ఞా ని పూ జా.

---

శ్రుతి॥ తస్య-నిశ్చింతా-ధ్యానం। సర్వకర్మ నిరాకరణ- మావాహనం। నిశ్చయజ్ఞాన-మాసనం। ఉన్మనీభావః-పాద్యం। సదామనస్క-మర్ఘ్యం। సదాదీప్తి-రపారామృత-వృత్తిః-స్నానం। సర్వాత్మభావనా-గంధః। దృక్స్వరూపావ స్థాన- మక్షతాః। చిదాప్తిః-పుష్పః। చిదగ్నిస్వరూపం - ధూపః। చిదాదిత్య-స్వరూపం-దీపః। పరిపూర్ణ - చంద్రామృత-స్యైకీకరణం-నైవేద్యం। నిశ్చలత్వం-ప్రదక్షిణం। సోహం భావో-నమస్కారః। మౌనం-స్తుతిః। సర్వసంతోషో- విసర్జనమితి॥ మండలబ్రాహ్మణోపనిషత్తు.

తాత్ప॥ (1) నిశ్చింతగానుండుటే ధ్యానము. (2) సర్వకర్మముల విడిచి

పెట్టుటె ఆవాహనము.(3) బ్రహ్మముసత్యము జగత్తుమిధ్య అను నిశ్చయ జ్ఞానమే ఆసనము. (4)ఉన్మనీభావమే పాద్యము.(5)సదాఆమనేస్వ-భావముండుంటే అర్ఘ్యము.(6)సదాజ్ఞానాకారముగానుండుటె స్నానము.(7)సర్వము బ్రహ్మమనిభావించుటె గంధము. (8)దృష్టిసదాబ్రహ్మమందు చెదరకుండుటె అక్షతలు. (9) ఆత్మదర్శనము చేయవలయునను తలంపె జ్ఞానాప్తియనబడును; ఈజ్ఞానాప్తియే పుష్పము.(10)ఆత్మనిష్ఠయందు బుద్ధి ఇట్టట్టు కదలక స్థిరముగానుండుటె జ్ఞానాగ్నియనబడును. ఈజ్ఞానాగ్నియే ధూపము.(11)(నేతి-నేతి)అనగా, నేనుదేహము కాదు నేనుమనస్సు జీవుడుకాదు, ప్రపంచము సర్వము నేనుకాదు, ఇన్నిటి నెరుగుచుండెడి సర్వసాక్షియగు ఆత్మయే నేనని ఎరింగెడు తత్వ వివేకమే జ్ఞానసూర్యుడనబడును; ఈజ్ఞానసూర్యుడే దీపము. (12) నేనే బ్రహ్మము బ్రహ్మమే నేను అని సర్వపరిపూర్ణమగు పరబ్రహ్మమందు ఐక్య భావమే నైవేద్యము. (13)చపలములేక నిస్సంకల్పముగనుండుటె ప్రదక్షిణము.(14)సోహంభావమే నమస్కారము. (15)నిర్వాసనా మౌనమే స్తుతి. (16) సర్వసంతోషమే విసర్జనము. ఇవియే జ్ఞాన షోడశోపచార ఆత్మపూజ.

## సమాధిలక్షణము.

---

శ్రుతి॥ అహమేవ-పరంబ్రహ్మ-బ్రహ్మాహమితి సంస్థితిః॥సమాధి-స్సతు విజ్ఞేయ-స్సర్వవృత్తి-వివర్జితః॥త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్తు.

తాత్ప॥ అంజనేయా! ఆత్మస్వరూపుడగు నేనే బ్రహ్మము అని ఐక్య భావము దృఢముగాగలిగి,సకలమనోవృత్తులు శూన్యమై,ఏతలంపులులేక సకలదృశ్యములుమఱచితాను తానైసాక్షిమాత్రుడై యుండుటె సమాధి.

శ్రుతి॥ ధ్యాతృ-ధ్యానే-విహాయ- నివాతస్థిత-దీపవత్ । ధ్యేయైక గోచరం-చిత్తం-సమాధిర్భవతి॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ నేనేబ్రహ్మముబ్రహ్మమేనేను అనిధ్యానించువాడు,ధ్యానము, అను ఈరెంటిని మఱచి గాలిలేనిచోట కదలక మెదలక ఉండు దీప

మువలె సకల సంకల్పములు నశించి, బ్రహ్మమునందు మనస్సు లయించి తాను బ్రహ్మాకారముగానుండు నిష్ఠయే సమాధి అనబడును.

శ్రుతి॥ సంప్రజ్ఞాత-సమాధి-స్స్యాత్-ధ్యానాభ్యాస-ప్రకర్షతః । ప్రశాంత-వృత్తికం-చిత్తం - పరమానంద-దీపకం॥ ముక్తికోపనిషత్తు.

తాత్ప॥ నేనే బ్రహ్మము, బ్రహ్మమే నేను అని, ఏకాంతస్థలమునందు గూర్చుండి చిత్తము నానావిధముల పోకుండా తదేకధ్యానముగా ధ్యానించుచుండుటే సంప్రజ్ఞాతసమాధి, లేక సవికల్పసమాధిఅనబడును.

శ్రుతి॥ అసంప్రజ్ఞాత - నామాయం సమాధి-ర్యోగినాం ప్రియః। ప్రభాశూన్యం-మనశ్శూన్యం-బుద్ధిశూన్యం-చిదాత్మకం॥ ముక్తికోపనిషత్తు.

తాత్ప॥ నేనే బ్రహ్మము బ్రహ్మమే నేను అనెడు ధ్యానమున్ను మఱచి, మనోబుద్ధులు రెండున్ను శూన్యమై, సకల తలంపులు మఱచి, దేహాది ప్రపంచము మొదలగు సకల దృశ్యములను మఱచి, తానుతానై తన్మయంబుగా కేవలచిన్మాత్రుడై సాక్షిగానుండుటే అసంప్రజ్ఞాత సమాధియనియుం నిర్వికల్పసమాధియనియు చెప్పబడును.

శ్రుతి॥ అజ్ఞానహృదయ-గ్రంథే-ర్నిశ్శేష-విలయ-స్తథా । సమాధినావికల్పేన-యదా-అద్వైతాత్మ-దర్శనం॥ అధ్యాత్మోపనిషత్తు.

తాత్ప॥ నిర్వికల్ప సమాధి నిష్ఠాభ్యాసముచేత అజ్ఞానమయమగు సమస్త హృదయగ్రంథులు నశించి, అనగా సంకల్పవికల్పములు నశించి, కేవల అద్వయ బ్రహమగు ఆత్మ సాక్షాత్కారము కలుగును.

శ్రుతి॥ సమాధి-నిష్ఠతామేత్య-నిర్వికల్పో-భవానఘ॥అధ్యాత్మోపని

తాత్ప॥ ఆంజనేయా! సదా నిర్వికల్ప సమాధి నిష్ఠాభ్యాసము చేయుచు నిర్వికారముగానుండుటకు ప్రయత్నపడుచుండుము.

శ్రుతి॥ ధర్మమేఘ-మిమం-ప్రాహుర్ - సమాధిం-యోగవిత్తమాః । వర్షత్యేవ-యథా-ధర్మామృత-ధారా-స్సహస్రశః । అమునా-వాసనా-జాలే-నిశ్శేషం-ప్రవిలాపితే॥ అధ్యాత్మోపనిషత్తు.

తాత్ప॥ ఆంజనేయా! ఈనిర్వికల్పసమాధిని ☞ ధర్మమేఘమని పెద్దలు చెప్పుదురు. దీనిచే స్వానుభవానందామృతము అమితముగ వర్షించి దేహవాసన శాస్త్రవాసన లోకవాసనలనెడి తాపములు చల్లారును

## వాసనా త్రయము.

---

శ్రుతి॥ దృఢ-భావనయా-త్యక్త - పూర్వాపర-విచారణం । యదా దానం-పదార్థస్య-వాసనా-సా-ప్రకీర్తితా॥ ముక్తికోపనిషత్తు.

తాత్ప॥ ఈసంసారానుభవము అనాదికాలమునుండి దృఢముగా అలవాటుపడియుండుటవలన ముందు ఏదియో వెనుక ఏదియో అనెడి వివేకములేక మరల అట్టి అనిత్యమైన సంసారానుభవమునే స్థిరముగానమ్మి దానియందు మనస్సు ఉంచి, సదా దానినే స్మరించుచు, అదే జ్ఞప్తిగానుండుటే ☞ వాసన అనబడును.

శ్రుతి॥ వాసనా-ద్వివిధా-ప్రోక్తా-శుద్ధాచ-మలినా-తథా । మలినా-జన్మహేతుస్స్యాత్ । శుద్ధాచ-జన్మ-వినాశినీ॥ముక్తికోపనిషత్తు.

తాత్ప! ఆంజనేయా ! పూర్వజన్మసంస్కారములేవాసనలనబడును అది శుద్ధవాసన,మలినవాసన, అని రెండువిధములు. మలినవాసన జననమరణములు కలిగించును. శుద్ధవాసన జననమరణములు లేకజేయును.

శ్రుతి॥ అజ్ఞాన-ఘనాకారా-ఘనాహంకార- శాలినీ । పునర్జన్మకరీ - ప్రోక్తా-మలినా-వాసనా-బుధైః॥ ముక్తికోపనిషత్తు.

తాత్ప॥ అజ్ఞానమే స్వరూపముగాగలదియు, సదా అహంకారమే స్వభావముగాగలదియునగు, మలినవాసనజననమరణముల కలిగించును.

శ్రుతి॥ లోక-వాసనయా-జంతోః-శాస్త్ర-వాసనయాపిచ। దేహవాసనయా-జ్ఞానం-యథావ-న్నైవ-జాయతే॥ ముక్తికోపనిషత్తు.

తాత్ప॥ ఆమలినవాసన, లోకవాసన అనియు, శాస్త్రవాసన అనియు దేహవాసన అనియు మూడువిధములు, ఈమూడు వాసనలవలన ఆత్మజ్ఞానము కలుగదు (1) లోకమున తానుచేయు మంచికార్యములవలన తన్ను ఎల్లవారున్ను పొగడుచుండవలయుననెడు తలంపె, లోకవాసనయనబడును (2) తామే సకలశాస్త్రములు చదివిన పండితులని గర్వించి, శివ విష్ణువులకు భేదము కల్పించి, శివుడే గొప్పదైవము శైవమతమే గొప్పమతమనియు,విష్ణువే గొప్పదేవుడు వైష్ణవమతమేగొప్ప

మతమనియు, ఒకరితోనొకరు వాదములాడి పోరాడుచుండుటే, శాస్త్ర వాసన అనబడును. (3) దేహపటుత్వము చెడకుండవలయుననియు తలవెండ్రుకలు నరసి ముసలితనము వ్యాధులు చావు మొదలైనవి రాకుండవలయుననియు, మూలికలు సిద్ధౌషధములు మొదలైనవి భుజించి కాయసిద్ధి పొందవలయుననెడి దేహాభిమానతలంపే, దేహవాసన అనబడును. ఇవి ఎందాక ఉండునో అందాక ఆత్మజ్ఞానము కలుగజాలదు. సదా ఆత్మధ్యానముచేయుచు ఆత్మానుభవ నిష్ఠయనెడు నిర్వికల్పసమాధినిష్ఠను అభ్యాసముచేయు పెద్దలకు ఈ వాసనాత్రయములు నశించునుగాని, తక్కినవారికి నశింపజాలదు.

శ్రుతి॥ లోకానువర్తనం-త్యక్త్వా-త్యక్త్వా-దేహానువర్తనం। శాస్త్రాను-వర్తనం-త్యక్త్వా-స్వాధ్యాసాపనయం-కురు॥ అధ్యాత్మోపనిషత్తు.

తాత్ప॥ లోకవాసన దేహవాసన శాస్త్రవాసనలనెడి వాసనాత్రయమును విడిచిపెట్టుము. నేను జీవుడను, సుఖిని, దుఃఖిని, బ్రాహ్మణుడను, శూద్రుడను అనునివి మొదలగు భ్రాంతులను నాశముచేయుము.

శ్రుతి॥ నానాయోని-శతంగత్వా-శేతేసౌ-వాసనావశాత్॥ త్రిశిఖిబ్రా

తాత్ప॥ ఈవాసనాత్రయమువల్లనేజీవుడు నానాయోనులం బుట్టును.

శ్రుతి॥ జన్మాంతర-శతాభ్యస్తా-మిథ్యా-సంసార-వాసనా। సాచిరాభ్యాస-యోగేన-వినా-నక్షీయతే-క్వచిత్॥ ముక్తికోపనిషత్తు.

తాత్ప॥ అనేక జన్మశతములచే అలవాటుచేయబడిన ఈమిథ్యాసంసారవాసన జీవబ్రహ్మైక్య జ్ఞానయోగ అభ్యాసములేక నశింపదు.

శ్రుతి॥ జ్ఞమనో-నాశమభ్యేతి-మనోఽజ్ఞస్యహి-శృంఖలా। తావన్నిశీవ-వేతాళా-వల్గంతి-హృది-వాసనాః। ఏకతత్వ-దృఢాభ్యాసా-ద్యావన్నవిజితం-మనః॥ ముక్తికోపనిషత్తు.

తాత్ప॥ జ్ఞానియొక్కమనస్సు తనకుతానే నశించును. అజ్ఞానియొక్కమనస్సు వానికి సంకెళ్లవలె బంధకముగానుండును. బ్రహ్మనిష్ఠాభ్యాసముచే మనోజయము ఎంతవరకు పొందకుండునో, అంతవరకు రాత్రివేళ భయంకరముగా భేతాళ పిశాచాది గ్రహములు సంచరిం

చుచు లోకమునకు బాధకలుగజేయునట్లు, అజ్ఞానియొక్క హృదయమునందు వాసనలనెడి భేతాళ పిశాచగ్రహములు సంచరించుచు, వానికి జన్మజరామరణ దుఃఖములను గలిగించుచుండును.

శ్రుతి॥ సర్వత్ర-సర్వతస్సర్వ-బ్రహ్మమాత్రావ- లోకనం। సద్భావ-వాసనా-దార్ఢ్యాత్-వాసనాలయ - గుశ్నుతే॥ అధ్యాత్మోపనిషత్తు.

తాత్ప॥ నీకంటితో చూడబడినవి, చెవులతో వినబడినవి, నీచేతులతో అంటిన వస్తువులు మొదలైనవి, ప్రపంచము సర్వమున్ను బ్రహ్మమే అని దృఢనిశ్చయముగలుగుటే శుద్ధవాసన అనబడును, దీనివల్లనే మలినమైన వాసనాత్రయము నశించును.

శ్రుతి॥ అసంగ-వ్యవహారత్వా-ద్భవభావన-వర్జనాత్ । శరీర-నాశదర్శిత్వా-ద్వాసనా-నప్రవర్తతే॥ ముక్తికోపనిషత్తు.

తాత్ప॥ (1) ఘటమునందలి ఆకాశము ఆఘటమునంటక ఆఘటముయొక్క వికారములను జెందక అసంగముగానుండునట్లు ఆత్మస్వరూపుడనగునేను దేహేంద్రియాదుల నంటక వానివికారములను జెందక అసంగముగా సాక్షిమాత్రముగానున్నాను ఆత్మస్వరూపుడనగునేనే బ్రహ్మము బ్రహ్మమేనేను అనెడి అపరోక్ష జ్ఞానానుభవము గలుగుటవల్లను, (2) దృఢవైరాగ్యముచే ఈసంసారము మిథ్యయని తెలియుటవల్లను, (3) శరీరములకు నాశనముగలుగుట సత్యమని తెలుసుకొనుటవల్లను [illegible] ఈ మూటివల్లనే మలిన వాసనా త్రయము నశించునుగాని, మరిదేనివల్లను నశింపదు.

## వైరాగ్యబోధోపరతుల లక్షణము.

---

శ్రుతి॥ వాసనానుదయో-భోగ్యే-వైరాగ్యస్య-తదావధిః॥అధ్యాత్మోప

తాత్ప॥ వైరాగ్యమనగా నిరాశగానుండుట. పుష్పము చందనము భార్య బిడ్డలు ధనము గృహము మొదలగువానియందలి భ్రాంతిని విడిచిపెట్టుటవలన వైరాగ్యము ప్రాప్తించును.

శ్రుతి॥అహం-భావోదయాభావో-బోధస్య-పరమావధిః॥అధ్యాత్మోపని

తాత్ప॥ బోధ అనగా, ప్రపంచము సర్వము మిథ్య అనియు, ఆత్మ స్వరూపుడగు తానే సత్యమైన బ్రహ్మమనియు తత్వవిచారణవలన తెలిసి ఆనందించుట. నేను నాది అనియెడు అహంకార మమకారములు, దేహాభిమానములు, లేనివారికే ఈబోధ ప్రాప్తించును.

శ్రుతి॥ లీనవృత్తే-రనుత్పత్తి-మర్యాదోప-రతేస్తు-సా॥ అధ్యాత్మోప

తాత్ప॥ సకలసంకల్పములు నశించినపిమ్మట మరల ఏసంకల్పములు న్నుపుట్టక సదా ఆత్మానుసంధానము చేయుటే ఉపరతి యనబడును.

శ్రుతి॥ స్థితప్రజ్ఞో-యతిరయం-యస్సదానంద-మశ్నుతే॥ అధ్యాత్మోప

తాత్ప॥ ఆంజనేయా! ఈవైరాగ్య బోధ ఉపరతులు గలిగి చంచలములేనట్టి ప్రజ్ఞగలవాడే బ్రహ్మానందమును అనుభవించును.

## బంధముక్తులు.

---

శ్రుతి॥ అనాద్యవిద్యా-వాసనయా-జాతోహమితి-సంకల్పో - బంధః । పితృమాతృ-సహోదర-దారాపత్య-గృహారామ-క్షేత్రాది-మమతా-సంసారావరణ-సంకల్పో-బంధః । కర్తృత్వా-ద్యహంకార-సంకల్పో-బంధః । అణిమా-ద్యష్టైశ్వర్య-ఆశాసిద్ధ-సంకల్పో-బంధః । దేవమనుష్యాది-ఉపాసనాకామ-సంకల్పో-బంధః । యమాది-అష్టాంగ-యోగాభ్యాసాది-సంకల్పో-బంధః । వర్ణాశ్రమ-ధర్మ-కర్మ - సంకల్పో బంధః । ఆజ్ఞాభయ-సంశయాత్మగుణ- సంకల్పో-బంధః । యజ్ఞవ్రత-తపోదాన-విధివిధానజ్ఞాన - సంకల్పో-బంధః । కేవల-మోక్షాపేక్షా-సంకల్పో-బంధః । సంకల్పమాత్ర-సంభవో - బంధః॥———॥ నిత్యానిత్య-వస్తు-విచారాదనిత్య-సంసార-సుఖదుఃఖవిషయ-సమస్త-క్షేత్రమమతాది-సమస్తబంధ-సంకల్పక్షయో-మోక్షః॥ నిరాలంబోపనిష

తాత్ప॥ సత్యజ్ఞానానంద పరబ్రహ్మమే తానని తెలియక, అనాదియగు అజ్ఞానమయుడగు జీవుడే తానను సంకల్పమే బంధము, సర్వసాక్షియగు బ్రహ్మమే తానని తెలియక, తనకు తల్లితండ్రులు అన్నద

మ్ములు భార్య బిడ్డలు గృహములు తోటలు ఇన్నిగల సంసారిగా తలం చుటె బంధము. శుద్ధనిర్గుణ పరబ్రహ్మమే తానని తెలియక, నేనునాది అనెడి అహంకార మమకారములుగలిగి, నేనే యజమానుడు నేనే నా భార్య బిడ్డలు మొదలైనవారిని పోషించువాడను అను సంకల్పమే బంధము. చావుపుట్టుకలులేని పరబ్రహ్మమే తానని తెలియక తనకు మర ణము గలదని భయపడి, కాయసిద్ధి పొంది చావకుండవలయునని యు అణిమాది అష్టసిద్ధులు పొందవలయునెడి సంకల్పమే బంధము. తానే సర్వాధారమైన పరబ్రహ్మమని తెలియక, హరిహరాది దేవత లను ధ్యానించి ఇష్టార్థములను పొందవలయునను సంకల్పమే బం ధము. నిత్యముక్త నిర్వికార కేవల అద్వయ పరబ్రహ్మమే తానని తె లిసి సకలము మఱచి సాక్షిమాత్రుడై ఆనందింపక, తనకంటెవేరుగా బ్రహ్మమున్నదని అష్టాంగ యోగముచేసి, భ్రూమధ్యంబున దృష్టినిలిపి, పంచముద్రలంబట్టి దశవిధనాదంబులు చిత్కళలు మండలంబులు జూ చుచు అవియే బ్రహ్మమను సంకల్పమే బంధము. నామరూపములు కుల గోత్రములులేని పరబ్రహ్మమే తానని తెలియక తనకు కులగోత్రముల వర్ణాశ్రమ ఆచారములు గలదను సంకల్పమే బంధము. తాపత్రయ శూన్యుడై సర్వముతానైన పరబ్రహ్మమే తానని తెలియక తనకు అజ్ఞ భయము సంశయము గలదను సంకల్పమే బంధము. తాను కర్మహీను డైన పరబ్రహ్మమని తెలియక, జపతప వ్రతయజ్ఞ దానాదులను కర్మకా డప్రకారము తప్పక చేయుచుండవలయునను సంకల్పమే బంధమ దేహేంద్రియంబులకు వేరైనట్టి నిత్యముక్త అశరీర పరబ్రహ్మ తానని తెలియక, తన్ను దేహేంద్రియములుగల జీవునిగా తలంచి తా మరణించినతర్వాత మోక్షము పొందవలయునను తలంపే బంధ నిత్యానిత్యవస్తు వివేకముగలిగి బ్రహ్మమే సత్యమనియు జగత్తు మి అనియు తెలిసి, అనిత్యమైన భార్య పుత్రులు ఇల్లు ధనము మొదలగు యందలి ఆశవిడిచిపెట్టి సుఖదుఃఖములు శరీరమునకేగాని సాక్షిం నాకులేవని తెలిసి, ఆత్మస్వరూపుడగు తానే బ్రహ్మమని సకలసం

ములునశించి సదాబ్రహ్మానందసాగరంబున మునిగియుండుటె మోక్షము.

శ్రుతి॥ యస్య-సంకల్పనాశ-స్స్యాత్-తస్య-ముక్తిః-కరేస్థితా॥మండలబ్రాహ్మణోపనిషత్తు.

తాత్ప॥ ఎవనికి సంకల్పములన్నియు అనగా తలంపులన్నియు నశించిపోవునో వానికి మోక్షము అరచేతిలోనుండును.

శ్రుతి॥ తస్మాత్-భావాభావౌ-పరిత్యజ్య-పరమాత్మధ్యానేన-ముక్తోభవతి॥ మండల బ్రాహ్మణోపనిషత్తు.

తాత్ప॥ భావాభావములు, అనగా ఒక్కటిని తలచుటే మరల మరచుట. ఈ తలపుమఱపులు శూన్యమై సదా ఆత్మధ్యానముచేయుచు, తన్మయముగానుండువాడే ముక్తుడు.

శ్రుతి॥ ద్వేపదే-బంధమోక్షాయ-నిర్మమేతి-మమేతిచ। మమేతి-బధ్యతే-జంతుః।నిర్మమేతి-విముచ్యతే॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ ఇదినాది ఇదినాకుకావలయును అనుటయే మమకారము, జ్ఞానానంద సర్వపరిపూర్ణ పరబ్రహ్మమే నేనుకాబట్టి, ఈదేహాదిప్రపంచము ఏదిన్ని నేనుకాను, ఏదిన్ని నాదికాదు అని తలంచుటే మమకారములేకపోవుట. ఈరెండుభావములే బంధముక్తులకు కారణములు. మమకారమువలన బంధము. మమకారము లేకపోవుటచే మోక్షము.

శ్రుతి॥ అహంబ్రహ్మేతి-నియతం-మోక్షహేతు-ర్మహాత్మనాం॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ ఆత్మస్వరూపుడగు నేనే పరబ్రహ్మము, అపర బ్రహ్మమే నేను అని ఐక్యానుసంధానంబు చేయుటే మోక్షమునకు కారణము.

శ్రుతి॥ నాహంబ్రహ్మేతి-జానాతి-తస్య-ముక్తి-ర్నజాయతే॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ నేనుబ్రహ్మము కాజాలను అనువాడు ముక్తిపొందడు.

శ్రుతి॥ బంధోహి-వాసనాబంధో। మోక్షస్స్యాత్-వాసనాక్షయః ముక్తికోపనిషత్తు.

తాత్ప॥ లోకవాసన శాస్త్రవాసన దేహవాసన అనెడి వాసనాత్ర

ణమువలన బంధమున్ను నిర్వాసనగానుండుటవలన ముక్తిన్ని గలుగును.

శ్రుతి॥ 'నాహందుఃఖీ-నమేదేహం-ఇతి-భావానురూపేణ - వ్యవహారేణ-ముచ్యతే॥ నాహం-మాంసం-నచాస్థిని। దేహాదన్యః-పరోస్మ్యహం। ఇతి-నిశ్చితవానంతః- క్షీణావిద్యో-విముచ్యతే ॥ మహోపనిషత్తు.

తాత్ప॥ నేనుదుఃఖినుగాను, నాకుదేహములేదు, ఈదేహమునకు వేరై సర్వసాక్షిగానుండు నాకు దుఃఖము ఎక్కడిది. సమస్త దుఃఖములున్ను ఈశరీరమునకే. నేను జ్ఞానానంద పరబ్రహ్మస్వరూపుడను, అని భావించుటవలన ముక్తిగలుగును. దేహగతములగు రక్తము మాంసము ఎముకలు నరములు మొదలైనవి నేనుగాను, దేహత్రయ విలక్షణమై సాక్షియగు ఆత్మయే నేను, ఆత్మస్వరూపుడనగు నేనే బ్రహ్మము, బ్రహ్మమే నేను, అని దృఢనిశ్చయముగలవాడే ముక్తిపొందును.

శ్రుతి॥ యదా-పంచావతిష్ఠంతే-జ్ఞానాని-మనసా-సహ । బుద్ధిశ్చ-నవిచేష్టేత-తామాహుర్-పరమాంగతిం॥ కఠోపనిషత్తు.

తాత్ప॥ శ్రోత్రము నేత్రము మొదలగు జ్ఞానేంద్రియంబులైదున్ను మనస్సున్ను ఆత్మయందుంచి ఇతరవ్యాపారములులేక సకలతలంపుల మఱచి నిశ్చలముగా తన్మయంబుగానుండుటే మోక్షమని పెద్దలు చెప్పుదురు.

శ్రుతి॥ చిచ్చైత్య-కలితో-బంధః । తన్ముక్తౌ-ముక్తి-రుచ్యతే । చిదచైత్యా-కిలాత్మేతి- । సర్వసిద్ధాంత-సంగ్రహః॥ మహోపనిషత్తు.

తాత్ప॥ జ్ఞానస్వరూపమగు ఆత్మను అనాత్మయైన శరీరముగా భావించుటే బంధము. అనగా ఆత్మానాత్మ వివేకములేక ఆత్మ ధర్మములైన సత్యజ్ఞానానందాది లక్షణములు శరీరమునకున్ను, శరీరధర్మములైన అనృతజడ దుఃఖాది లక్షణములు ఆత్మకున్ను, గలిగియుండునట్లు అధ్యాసము చేసుకొనుటయే అనాదియైన సంసారబంధము. అట్టి అధ్యాసమును విడిచిపెట్టుటయే మోక్షమనబడును.

శ్రుతి॥ సర్వభూతస్థ-మాత్మానం-సర్వభూతాని - చాత్మని । సంపశ్యన్ - బ్రహ్మ-పరమంయాతి-నాన్య-హేతునా॥ కైవల్యోపనిషత్తు.

తాత్ప॥ ఆత్మ సర్వభూతములందు వ్యాపించియుండునదియనియు, సర్వభూతములు ఆత్మయందు ఉండుచున్నవనియు, అట్టి ఆత్మస్వరూపుడగు తానే బ్రహ్మము, బ్రహ్మమే ఆత్మయని అభేదముగా దర్శించునట్టివాడే ముక్తిపొందును, తక్కినవాడు పొందజాలడు.

శ్రుతి॥ భూతేషు-భూతేషు-విచింత్య-ధీరాః। ప్రేత్యాస్మా- ల్లోకా-దమృతా-భవంతి॥—॥ కేనోపనిషత్తు.

తాత్ప॥ సమస్త వస్తువులలోను ఆత్మస్వరూపుడగు తానేయున్నాడని తెలిసికొన్నట్టి మహాత్ముడు ఈ జన్మములోనే మోక్షమును పొందును.

శ్రుతి॥ యథా-సర్వే-ప్రముచ్యంతే-కామా-యేస్య - హృదిస్థితాః। అథ-మర్త్యోమృతో-భవత్యత్ర-బ్రహ్మ-సమశ్నుతే॥ కఠోపనిషత్తు.

తాత్ప॥ సకలకోరికలున్ను ఎప్పుడు బొత్తిగా నశించిపోవునో, అప్పుడు అట్టివాడు బ్రహ్మస్వరూపుడగుచు ముక్తి పొందుచున్నాడు.

## జీవన్ముక్తి లక్షణము.

---

శ్రుతి॥ క్రియా-నాశాద్భవేత్-చింతానాశో-స్మాద్వాసనా- క్షయః। వాసనాప-క్షయో మోక్ష-స్సజీవన్ముక్తి-రిష్యతే॥ అధ్యాత్మోపనిషత్తు.

తాత్ప॥ ఓ ఆంజనేయా ! సకలవ్యాపారములు నశించినయెడల, చింతలేకుండును. చింతలేకుండుటవలన వాసనాత్రయము నశించును, అట్లు నశించుటే జీవన్ముక్తియనబడును.

శ్రుతి॥ బ్రహ్మణ్యేవ-విలీనాత్మా-నిర్వికారో-వినిష్క్రియః॥ బ్రహ్మాత్మనో శోధితయో-రేకభావావ-గాహినీ। నిర్వికల్పాచ- చిన్మాత్రా-వృత్తిః - ప్రజ్ఞేతి-కథ్యతే। సాసర్వదా-భవేద్యస్య-స- జీవన్ముక్త- ఇష్యతే॥—॥ దేహేంద్రియే-ష్వహంభావ-ఇదంభావ- స్తదన్యకే। యస్య-నోభవతః - క్వాపి-స-జీవన్ముక్త-ఇష్యతే॥—॥ నప్రత్యగ్బ్రహ్మణో-ర్భేదం- కదాపి - బ్రహ్మసర్గయోః। ప్రజ్ఞయా-యో-విజానాతి-సజీవన్ముక్త-ఇష్యతే ॥—॥ సాధుభిః పూజ్య - మానేస్మిన్-పీడ్యమానేపి-దుర్జనైః। సమభావో భవేద్యస్య-స-జీవన్ముక్త-ఇష్యతే॥ అధ్యాత్మోపనిషత్తు.

శ్రుతి॥ నకర్తా-నైవభోక్తాచ-నభోజయితా-తథా॥వరాహోపనిషత్తు

తాత్ప॥ నేనుకర్తగాదు, ఏమిన్ని చేయుటలేదు, నేను భోక్తగాను, ఏదిన్ని అనుభవించుటలేదు, నేను ఇతరులను అనుభవింప చేయువాడనుగాను, కేవలసాక్షిమాత్రుడను, అకర్తను, అభోక్తను అని నిశ్చయించుకొని కర్తృత్వ అహంకారము లేనివాడే జ్ఞాని. అట్టి అహంకారములేని జ్ఞాని ఏకార్యములను చేయడు, ఒకవేళ చేసినను, దోషము లేదు. ఇట్టి జ్ఞానులు బాలోన్మత్త పిశాచాదుల రీతిగానుందురు.

శ్రుతి॥ యః-స్వసమస్తార్థ-జాలేషు-వ్యవహార్య-అపి-శీతలః । పరార్థేష్వివ-పూర్ణాత్మా-సజీవన్ముక్త-ఉచ్యతే॥ వరాహోపనిషత్తు.

తాత్ప॥ జ్ఞాని లోకులరీతిగా సకలమైన కార్యములు చేయుచున్నను (ఇతరులకార్యములవలె) అనగా ఇతరులకార్యములందు తనకు పట్టులేనట్లు, తానుచేయుకార్యములందును పట్టులేనివాడుగానుండుచు చేయుచు, జగత్తు స్వప్నమువలె మిథ్యయనితలంచి భ్రాంతిలేనివాడై నిరాశగానుండుచు పరమశాంతినిబొంది బ్రహ్మస్వరూపుడైయుండును.

శ్రుతి॥ సర్వావస్థాసు-జ్ఞానజ్ఞేయా-ధ్యానధ్యేయా-లక్ష్యాలక్ష్య-దృశ్యాదృశ్యేచ-ఊహాపోహాది-పరిత్యజ్య-జీవన్ముక్తో-భవతి॥ మండలబ్రాహ్మ

తాత్ప॥ జాగ్రత స్వప్న సుషుప్తి యనెడు మూడవస్థలందు తోచెడు సకలపదార్థములున్ను జ్ఞానజ్ఞేయములున్ను ధ్యానధ్యేయములున్ను లక్ష్యాలక్ష్యములున్ను దృశ్యాదృశ్యములున్ను ఊహాపోహలున్ను సర్వముమిథ్యయని భ్రాంతిలేనివాడై అహంకారము నశించి సర్వసాక్షియగు తానే బ్రహ్మమని సదా తనలోతన్ను చూచుచు కేవలసాక్షిమాత్రుడై బ్రహ్మాకారముగానుండువాడే జీవన్ముక్తుడు.

## విదేహముక్తి లక్షణము.

---

శ్రుతి॥ జీవన్ముక్తపదం-త్యక్త్వా-స్వదేహే-కాలసాత్కృతే। విశతి-అదేహముక్తత్వం-పవనో-స్పందతామివ । అశబ్దమస్పర్శ-మరూపమవ్యయం-తథారసం-నిత్యమగంధవచ్చ-యత్ । అనాద్యనంతం-మహతః

మొదలగు వికారములు లేనివాడై తిక్కలి సంతోషముగలవాడై అం బట్టిగంజికి ఆశించక, ఎక్కడను సంచారముచేయక ఉన్నచోటనే పడుకొని సుఖముగా నిద్రబోవుచుండునట్లు, జ్ఞానామృతపానముచేసి తృప్తిపొందిన జ్ఞాని సకలకార్యములున్ను దైవాధీనముగా పూర్వకర్మ మునను సరించి జరుగుచున్నదేగాని, నేను ఏమిన్ని చేయుటలేదని దృఢ నిశ్చయముకలిగి అహంకారశూన్యుడై ఏవ్యాపారమున్ను చేయక, నిశ్చలుడై ఉన్నచోటనే సదాబ్రహ్మానంద నిద్రజెందుచుండును. అట్టి వాడే జీవన్ముక్తుడు. వ్యాపారశూన్యముగాకున్న జీవన్ముక్తుడుగాడు.

శ్రుతి॥ ప్రారబ్ధకర్మ-పర్యంతం-మహి-నిర్మోకవత్-వ్యవహారతి చంద్రవచ్చరతే-దేహీ-సముక్త-శ్చానికేతనః॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ ప్రారబ్ధకర్మము నశించువరకును ఎట్టివారికిని దేహము నశించదుగాన, జ్ఞాని ప్రారబ్ధము నశించువరకును దేహధారుడైయుం డును. అయితే కోసివేసిన పంటయొక్కమొక్కలు మరల మొలవ కుండా ఉండునట్లు, జ్ఞానాగ్నివలన ఇకమీద తనకు పునర్జన్మమురా కుండా జేసుకొని, పున్నమచంద్రునిరీతిగా నిష్కళంకుడై ఏదోషము న్ను లేనివాడై కర్తృత్వ భోక్తృత్వములనెడు అహంకారశూన్యుడై సంకల్పశూన్యుడై బురదలోనుండు కుమ్మరపురుగునకు అబురద అంట నట్లు సంసారమునందుండియు దానినంటక, వశీకృత మానసేంద్రి యుండై, సకలజనులకు మిత్రుడై, అతిదయాళుత్వముగలవాడై ఓర్పు గలవాడై, కోపతాపములు అసూయ భయము మొదలగునవి లేని వాడై, తనకు ఇష్టమగు పదార్థములు లభించుటవలన సంతోషమున్ను తనకు ఇష్టములేనిపదార్థములు లభించుటవలన దుఃఖమున్ను లేనివాడై, తనకు పూర్వకర్మానుసారముగా ఎదిఎది ప్రాప్తించునో దానితోడ తృప్తిపొందుచు తనకు లభించని వస్తువులకుగాను దుఃఖింపక దూషణ భూషణలు సమముగా తలంచుచు సదా బ్రహ్మాత్మైక్యానుసంధానము చేయుచుండును. ఇతడే జీవన్ముక్తుడు

శ్రుతి॥ సర్వలోక-స్తుతవాంశ్చ-స్సర్వదేశ-సంచారశీలః। పరమాత్మ

గగనే-బిందుం-నిక్షిప్య-శుద్ధాద్వైతాజాడ్య-సహజామనస్క - యోగ నిద్రాఖండ-పదానువృత్త్యా-జీవన్ముక్తో-భవతి॥ మండలబ్రాహ్మణోపనిష.

తాత్ప॥ సర్వలోకస్థులచేత స్తుతింపబడినవాడైన జ్ఞాని, యథేచ్ఛగా నిర్భయముగా సర్వదేశ సంచారశీలుండై బట్టబయలైన సచ్చిదానందపర బ్రహ్మమే నేనని సదా దానియందే బుద్ధినిలిపి తనకన్యమేదియు లేదని సర్వము తానని పరిశుద్ధ అద్వైత బ్రహ్మసాక్షాత్కారమును జెంది, సహజామనస్క యోగ నిద్రారతుండై, సదా అఖండానందవృత్తితో నుండును, అట్టి వాడే జీవన్ముక్తుడు

శ్రుతి॥ తీర్థే-శ్వపచగృహేవా-తనుం-విహాయ- యాతి-కైవల్యం ప్రాణానవకీర్య-యాతి-కైవల్యం॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ ☞ కాశి రామేశ్వరము మొదలగు పుణ్యక్షేత్రములందైనను, పుణ్యతీర్థములందైనను చండాలుని గృహమందైనను ఎట్టిచోటనైనను జ్ఞాని ప్రారబ్ధము నశించినతోడనే శరీరమును విడిచి బ్రహ్మైక్యమును జెందునుగాన, అతడు ఎట్టిచోట ప్రాణము విడిచినను దోషములేదు. బ్రహ్మజ్ఞానికి ఇది బ్రాహ్మణ అగ్రహారము, ఇది మాలవాడ అనే భేదములేక, సర్వము సమముగా అభేదముగానుండును.

శ్రుతి॥ యత్రయత్ర-మృతోజ్ఞానీ- యేనవాకేన-మృత్యునా । యథా-సర్వగతం-వ్యోమం-తత్రతత్ర-లయంగతః॥ ఘటాకాశ-మివాత్మానం- విలయంవేత్తి-తత్వతః ।సగచ్ఛతి-నిరాలంబం-జ్ఞానలోకం-సమంతతః॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ ☞ జ్ఞాని, మాలవాని గృహమునందైనను, లేక బ్రాహ్మణ గృహమునందైనను ఎట్టిచోటనైనను, వ్యాధిపీడితుడైగాని, లేక వ్యాధిలేకుండానైనగాని, తెలివితోడనైనను, తెలివితప్పియైనను, ఏలాగుమరణించినను దోషములేదు. జాతినీతులు కులగోత్రములు సకలరోగములు సకలదుఃఖములు శరీరమునకేగాని తనకులేదనియు, తానేబ్రహ్మమనియు తెలిసి ఆనందించుచున్నాడుగాన, తాను మరణించిన తక్షణమే, [illegible]నే ఘటాకాశము మహాకాశమున కలిసిపోవునట్లు

సత్యముగా సర్వపరిపూర్ణ పరబ్రహ్మమునందే ఐక్యమగుచున్నాడు.

శ్రుతి॥ దగ్ధస్య-దహనంనాస్తి - పక్వస్య-పచనం-యథా। జ్ఞానాగ్ని దగ్ధదేహస్య-నచశ్రాద్ధం-నచక్రియా॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ బ్రహ్మమే తానని జ్ఞానాగ్నివలన, దేహమే తాననెడి భ్రాంతి నశించిపోవునుగాన, జ్ఞాని జ్ఞానాగ్నిదగ్ధ శరీరుడనబడును. అగ్నిలో కాలి బూడిదగాపోయిన వస్తువును మరల కాల్చుటలేదు, అట్లు జ్ఞానాగ్నివలన దేహమే తాననెడి భ్రాంతి నశించిన జ్ఞాని, మరణించినతర్వాత అతని స్థూలశరీరమును మరల శ్మశానాగ్నిలో దహనము చేయరాదు. అతనికి తిలోదానము పిండప్రదానము మొదలగు కర్మక్రియలు శ్రాద్ధము మొదలైనవి చేయరాదు అయితే అతనిశరీరమును భూమిలోచేర్చి సమాధిక్రియలు చేయవలయును.

శ్రుతి॥ తత్రకో-మోహః-కశ్శోకః-ఏకత్వ-మనుపశ్యతః। తరతి-శోకమాత్మవిత్ । భిద్యతే-హృదయగ్రంధి-శ్ఛిద్యంతే - సర్వసంశయాః క్షీయంతేచాస్య-కర్మాణి-యస్మిన్-దృష్టే-పరావరే॥ కఠోపనిషత్తు.

తాత్ప॥ సర్వముతానైన పరబ్రహ్మమే, తానని తెలిసి తనకంటె అన్యమైన పదార్థమున్నదని తలంచక సదా సర్వమును తానుగానెంచుచు, తన్నుతాను జూచుకొనుచుండెడి జ్ఞానికి శోకమోహములు లేవు, అతడు జననమరణ దుఃఖసాగరమును దాటి నిత్యానందంబును జెందును. మరియు, అతనికి సకలగ్రంధులున్ను సకలసందేహములును, సకల కర్మములున్ను నశించి, అతడు బ్రహ్మస్వరూపుడగుచున్నాడు.

శ్రుతి॥జీవః-పంచవింశకః-స్వకల్పిత చతుర్వింశతి-తత్వం-పరిత్యజ్య। షడ్వింశ-పరమాత్మాహమితి-నిశ్చయాత్-జీవన్ముక్తో - భవతి॥ మండల బ్రాహ్మణోపనిషత్తు.

తాత్ప॥ ఇరువదియైదవ తత్వముగా జీవాత్మగానుండెడు తాను, దేహేంద్రియాది ౨౪-తత్వములు తానుగాదనుచు, వాటియందలి భ్రాంతిని విడిచిపెట్టి, ౨౬-వ-తత్వమైన పరబ్రహ్మమే తానని దృఢనిశ్చయముగలవాడే జీవన్ముక్తుడు.

శ్రుతి॥ నకర్తా-నైవభోక్తాచ-నభోజయితా-తథా॥వరాహోపనిషత్తు

తాత్ప॥ నేనుకర్తగాను, ఏమిన్ని చేయుటలేదు, నేను భోక్తగాను, ఏదిన్ని అనుభవించుటలేదు, నేను ఇతరులను అనుభవింప చేయువాడనుగాను, కేవలసాక్షిమాత్రుడను, అకర్తను, అభోక్తను అని నిశ్చయించుకొని కర్తృత్వ అహంకారము లేనివాడె జ్ఞాని. అట్టి అహంకారములేని జ్ఞాని ఏకార్యములను చేయడు, ఒకవేళ చేసినను, దోషము లేదు. ఇట్టి జ్ఞానులు బాలోన్మత్త పిశాచాదుల రీతిగానుందురు.

శ్రుతి॥ యః-స్వమస్తార్థ-జాలేషు-వ్యవహార్య-అపి-శీతలః । పరార్థేష్వివ-పూర్ణాత్మా-సజీవన్ముక్త-ఉచ్యతే॥ వరాహోపనిషత్తు.

తాత్ప॥ జ్ఞాని లోకులరీతిగా సకలమైనకార్యములు చేయుచున్నను ☞ (ఇతరులకార్యములవలె) అనగా ఇతరులకార్యములందు తనకు పట్టులేనట్లు, తానుచేయుకార్యములందును పట్టులేనివాడుగానుండుచు చేయుచు, జగత్తు స్వప్నమువలె మిథ్యయనితలంచి భ్రాంతిలేనివాడై నిరాశగానుండుచు పరమశాంతినిబొంది బ్రహ్మస్వరూపుడైయుండును.

శ్రుతి॥ సర్వావస్థాసు-జ్ఞానజ్ఞేయా-ధ్యానధ్యేయా-లక్ష్యాలక్ష్య-దృశ్యాదృశ్యేచ-ఊహాపోహాది-పరిత్యజ్య-జీవన్ముక్తో-భవతి॥ మండలబ్రాహ్మ

తాత్ప॥ జాగ్రత స్వప్న సుషుప్తి యనెడు మూడవస్థలందు తోచెడు సకలపదార్థములున్ను జ్ఞానజ్ఞేయములున్ను ధ్యానధ్యేయములున్ను లక్ష్యాలక్ష్యములున్ను దృశ్యాదృశ్యములున్ను ఊహాపోహలున్ను సర్వముమిథ్యయని భ్రాంతిలేనివాడై అహంకారము నశించి సర్వసాక్షియగు తానే బ్రహ్మమని సదా తనలోతన్ను చూచుచు కేవలసాక్షిమాత్రుడై బ్రహ్మాకారముగానుండువాడే జీవన్ముక్తుడు.

## విదేహముక్తి లక్షణము.

---

శ్రుతి॥ జీవన్ముక్తపదం-త్యక్త్వా-స్వదేహే-కాలసాత్కృతే। విశతి-అదేహ-ముక్తత్వం-పవనో-స్పందతామివ । అశబ్దమస్పర్శ-మరూపమవ్యయం-తథారసం-నిత్యమగంధవచ్చ-యత్ । అనాద్యనంతం-మహతః

పరం-ధ్రువం-తదేవ-శివ్యత్యమలం-నిరామయం॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ జ్ఞాని, ప్రారబ్ధము నశించినంతనే దేహత్రయము నశించి, జీవభ్రాంతి నశించి, జీవన్ముక్తిని విడిచి, దేహములేనట్టి విదేహముక్తిని పొందును. అప్పుడు శబ్దస్పర్శ రూపరసగంధములులేని నామరూపక్రియాశూన్యమైన సర్వోత్కృష్టమైన నిరామయమైన పరబ్రహ్మమునందు కలిసి ఏకమైపోవును.

శ్రుతి॥ యథా-జలేజలం-క్షిప్తం-క్షీరంక్షీరే - ఘృతం - ఘృతే। అవిశేషో-భవేత్తద్వత్-జీవాత్మ-పరమాత్మనోః॥ యథోదకే-తోయ - మనుప్రవిష్టం-తథాత్మరూపో-నిరుపాధి-సంస్థితః॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ జలములో జలము, పాలులో పాలు, నేతిలో నేయి, కలిసి ఏకమైపోవునట్లు, ఈశరీరము నశించినంతనే జీవోపాధి నశించి, బ్రహ్మమందు.ఆత్మ కలిసి ఏకమైపోవుటే, విదేహముక్తి యనబడును.

శ్రుతి॥ బ్రహ్మ-బ్రహ్మేత్యథా-యాంతి-యేవిదుర్బ్రాహ్మణా - స్తథా। అత్రైవ-తే-లయంయాంతి - లీనాశ్చావ్యక్త-శాలినో- లీనాశ్చావ్యక్తశాలిన-ఇతి॥ మంత్రికోపనిషత్తు.

తాత్ప॥ బ్రహ్మమే ఆత్మ, ఆత్మయే బ్రహ్మమని అభేదముగా బ్రహ్మానుసంధానముచేయు జ్ఞానులు మరణించినతర్వాత శుద్ధనిర్గుణ నిరాకార పరిపూర్ణ బ్రహ్మమునందు గలిసి అభేదముగా వేరుపడకుండా ఏకమైపోదురు. ☞ఇదే విదేహముక్తి, విదేహకైవల్యము అనబడును.—

శ్రుతి॥ యథా-నద్య-స్స్యందమానా। స్సముద్రే-అస్తంగచ్ఛంతి-నామరూపే-విహాయ।తథా-విద్వాన్నామ-రూపాద్విముక్తః-।పరాత్పరం-పురుష-ముపైతి-దివ్యం॥—॥

తాత్ప॥ ☞గంగాది నదులు ప్రవహించుచు సముద్రమందు చేరినతోడనే నామరూపములును విడిచిపెట్టి తమస్వరూపము చెడి సముద్రస్వరూపమైనట్లు, బ్రహ్మజ్ఞాని మరణించినతోడనే స్థూలసూక్ష్మ కారణ శరీరములు నశించి, నామరూపములు నశించి అతడు శుద్ధనిరాకార పరబ్రహ్మమందు ఐక్యమగుచు అపరబ్రహ్మ స్వరూపమేయగుచున్నాడు.

శ్రుతి॥ యోఽకామో-నిష్కామ-ఆప్తకామ-ఆత్మకామః।నతస్య-
ప్రాణా-ఉత్క్రామంతి బ్రహ్మైవసన్-బ్రహ్మాప్యేతి॥బృహదారణ్యోప

శ్రుతి॥ సో కామో-నిష్కామో-ఆప్తకామ-ఆత్మకామో- నతస్య-
ప్రాణా-ఉత్క్రామం-త్యత్రైవ-సమవలీయంతే॥ బ్రహ్మైవసన్-బ్ర
హ్మాప్యేతి-॥ అశరీరో-నిరింద్రియో-అప్రాణో-హ్యమనస్సచ్చిదానంద
మాత్ర-స్స్వరాడ్భవతి॥ తాపనీయోపనిషత్తు.

తాత్ప॥ బ్రహ్మమే ఆత్మ, ఆత్మయే బ్రహ్మమని, అభేద ఐక్యజ్ఞానము గలిగి ఆత్మధ్యానముచేయుచుండు బ్రహ్మజ్ఞాని మరణించినతోడనే శరీరము ఇంద్రియములు ప్రాణము మనస్సు మొదలైనవి లేనట్టివాడై, కేవల నిరాకార సచ్చిదానంద పరబ్రహ్మమునందు ఐక్యమగుచు ఆపరబ్రహ్మమే యగుచున్నాడు సుమా.

శ్రుతి॥ ఏవం-త్రిపుట్యాం-నిరస్తాయాం! నిస్తరంగ-సముద్రవ-న్నివా
తస్థిత-దీపవదచల-సంపూర్ణ-భావాభావ- విహీన-కైవల్య - జ్యోతిర్భ
వతి॥==।మండలబ్రాహ్మణోపనిషత్తు.

తాత్ప॥ ద్రష్ట దర్శన దృశ్యములనెడి త్రిపుటిని మీరినట్టి పరబ్రహ్మము ఆత్మయే తానని ఆత్మానుసంధానము చేయుచుండు జ్ఞాని మృతిబొందిన తర్వాత తాను అలలులేని సముద్రమురీతిగాను, గాలిలేనట్టి చోటనుండు దీపమురీతిగాను, చలనములేక అచల పరిపూర్ణమైనదియును, భావాభావ శూన్యమైనదియును, శుద్ధనిరాకార సచ్చిదానంద కైవల్య జ్యోతిస్స్వరూపమైనదియునగు పరబ్రహ్మమునందు గలిసి, ఆ పరబ్రహ్మమే యగుచున్నాడు.-

శ్రుతి॥ యథోదకం-శుద్ధే-శుద్ధమాసిక్తం-తాదృగేవ-భవతి । ఏవం-
మునేర్విజానత-ఆత్మాభవతి-గౌతమ॥ కఠోపనిషత్తు.

తాత్ప॥ ఆత్మయే పరబ్రహ్మమని తెలుసుకొన్న ఆత్మజ్ఞానియొక్క- ఆత్మ, నిర్మలమైనజలములో నిర్మలమైనజలము గలిసి ఏకమైనట్లు, పరబ్రహ్మమునందు గలిసి ఏకమగుచు ఆపరబ్రహ్మమే యగుచున్నది

శ్రుతి॥ యత్ర-నాన్యత్పశ్యతి-నాన్యచ్ఛృణోతి-నాన్యద్విజానాతి-స భూమా॥యోవై భూమా-తదమృతం॥అథయత్రాన్యత్-పశ్యత్యన్య-చ్ఛృణోతి-అన్యద్విజానాతి-తదల్పం॥అథ-యదల్పం-తన్మర్త్యం॥ ఛాందోగ్య శ్రుతి॥ ఈశ్వరుడు భక్తుడు అని ఇద్దరుగానుండుచు ఒకరినొకరు చూచుచు మాట్లాడుచు సంతోషించుచునుండునట్టి సత్య వైకుంఠ కైలాసాదులు శరీరసహితములైనట్టి మోక్షస్థానములుగాన-[శ్రుతి॥ బ్రహ్మా-విష్ణు-రుద్రశ్చ-సర్వావా-భూతజాతయః । నాశమేవాను-ధావంతి-సలిలానీవ-బాడబం॥] అనెడి మహోపనిషత్తురీతిగా-అవి నిత్యముక్తి గాజాలవు. ఐతే [శ్రుతి॥ తత్ర-కోమోహః - కశ్శోకః-ఏకత్వ-మనుపశ్యతః॥] అనెడి ఈశావాస్యోపనిషత్తురీతిగాను,- మరియు [శ్రుతి॥ యత్రహి-సర్వ-మాత్మైవాభూత్ । తత్కేన-కంపశ్యేత్॥] అనెడి బృహదారణ్యోపనిషత్తురీతిగాను, మరియు— [శ్రుతి॥నహవై-సశరీరస్య-సతః-ప్రియాప్రియయో-రపహతి-రస్తి। అశరీరంవా-వసంతం-నప్రియాప్రియే-స్పృశతః॥] అనెడి శ్రుతివాక్యరీతిగాను, ఈశ్వరుడు భక్తుడు అనిఇద్దరుగాలేక ఎట్టివిధమైన శరీరమున్ను లేక ఈఆత్మ, బ్రహ్మముతోడ అభేదముగా ఐక్యమగుటే నిత్యముక్తి, విదేహముక్తి, విదేహకైవల్యము పరమపద మనబడును.

## జ్ఞా న జ ప త పా దు లు.

---

శ్రుతి॥ అహింసాతు-తపోయజ్ఞో-వాఙ్మనః-కాయభిః॥శాట్యాయనీ శ్రుతి॥ మనోవాక్కాయములనెడి త్రికరణశుద్ధిగా జీవహింసలు చేయకుండుటే, తపస్సు యజ్ఞము అనబడునుగాని, నల్లమేకలను చంపి అగ్నిగుండములోవేసి కాల్చి ఆమాంసముతినుట యజ్ఞముగాజాలదు. ఇట్లు జీవహింసచేసి యాగముచేయువారు నిజమైన జ్ఞాన బ్రాహ్మణులుగాజాలరు. వీరిని కర్మబ్రాహ్మణులని చెప్పబడును.

శ్రుతి॥ బ్రహ్మసత్యం-జగన్మిథ్యేతి-అపరోక్షజ్ఞానాగ్నినా- బ్రహ్మాద్యైశ్వర్యాశా-సిద్ధ-సంకల్పబీజ-సంతాపరూపం-తపః॥నిరాలంబోపనిషత్తు.

తాత్ప॥ బ్రహ్మము సత్యము జగత్తు మిథ్య అనియు, బ్రహ్మమే తానని యు ఎరుగుటే అపరోక్షజ్ఞానమనబడును. ఈజ్ఞానాగ్నిచేత అనిత్యము లైన బ్రహ్మవిష్ణుమహేశ్వరాదుల స్వర్గవైకుంఠకైలాసాదిపదవుల బొం దవలయునను ఆశాబీజమును కాల్చి నాశముచేయుటే తపస్సనబడును.

శ్రుతి॥ ఆత్మానం-చేద్విజానీయాత్ - అయమస్మీతి-పూరుషః। కిమి చ్ఛన్-కస్యకామాయ-శరీరమనుసం-జ్వరేత్॥ శాట్యాయనీయోపనిష.

తాత్ప॥ ఆత్మస్వరూపుడగు తానే బ్రహ్మమని తెలిసినజ్ఞాని, ఏమిపొం దవలయునని దేనికోరి తపస్సుచేసి శరీరమును తపింపజేయును, అనగా దేనిన్నికోరజాలడు. మూఢులరీతిగా తనకంటెవేరుగా ఒకదైవమున్న దని భ్రమించి ఆదేవతనుగూర్చిజపతపాదుల చేయజాలడు, అన్నపా నాదులు విడిచిపెట్టి ఉపవాసముండుచు శరీరమును కష్టపెట్టజాలడు.

శ్రుతి॥ అస్తి-బ్రహ్మేతి-విజ్ఞానం - పరోక్షజ్ఞాన-ముచ్యతే। అహం బ్రహ్మేతి-విజ్ఞాన-మపరోక్ష-జ్ఞానముచ్యతే॥ తేజోబిందూపనిషత్తు.

తాత్ప॥ తనకంటెవేరుగా బ్రహ్మమొకటియున్నదని దాని ఉపా సించుటే పరోక్షజ్ఞానమనబడును, దీనిచే జన్మాంతరంబున ముక్తి గ లుగును. ఐతే బ్రహ్మమే నేను నేనే బ్రహ్మము అని తెలిసి ఐక్యభావముం డుటే అపరోక్షజ్ఞానమనబడును, దీనిచే ఈజన్మముందే ముక్తిగలుగును.

శ్లో॥ ఇంద్రియద్వార - సంగ్రాహ్యై-ర్గంధాద్యై- రాత్మదేవతాం। స్వయం-భక్త్యా-సమారాధ్య జ్ఞాతుం-సోయం-మహామఖః॥

తాత్ప॥ ఇంద్రియములను దానిదాని వికారకార్యములందు పోని య్యక త్రిప్పి ఆత్మనిష్ఠచేయుటే మహాయాగమనబడును, నల్లమేకలను చంపి అగ్నిగుండములోవేసికాల్చి దానినితినుట యాగముగాజాలాదు.

శ్రుతి॥ ప్రాణేంద్రియా-ద్యంతఃకరణ-గుణాదేః-పరతరం। సచ్చిదా నందమయ-సర్వసాక్షికం-నిత్యము క్త-బ్రహ్మస్థానం-పరమపదం॥నిరాలం

తాత్ప॥ ప్రాణము ఇంద్రియంబులు అంతఃకరణము వీనికన్నిటికిని వేరుగా సచ్చిదానంద సర్వసాక్షిగానుండు ఆత్మయే పరబ్రహ్మము. అ [illegible] స్థానము అనబడును.

శ్రుతి॥ అతస్సంసార-విషయ-జనప్ర-సంసర్గ ఏవ-నరకః। సత్సంస ర్గః-స్వర్గః॥ నిరాలంబోపనిషత్తు.

తాత్ప॥ సంసారవిషయ వ్యవహారములందు తగులుపడుటే, నరక ము. దీనికంటెగొప్ప నరకము వేరేలేదు. సదా బ్రహ్మమునందు మనస్సు ల్లయించియుండుటే స్వర్గము. దీనికంటెగొప్ప స్వర్గము వేరేలేదు.

శ్రుతి॥ సచ్చిదానందానుభవ-స్వరూపంజ్ఞాత్వా-ఆనందరూపో-యు స్తిత్తి।సఏవసుఖం-అతస్సంసారవిషయా-సంకల్పఏవ-దుఃఖం॥ నిరాలం॥

తాత్ప॥ సచ్చిదానంద పరబ్రహ్మమే ఆత్మయని తెలిసి సకలము మ జచి ఆత్మానుభవ నిష్ఠయందుండుటె పరమ సుఖమనబడును. భార్య బిడ్డలు మొదలగు సంసారవిషయ సంకల్పమే మహాదుఃఖము అనబడును.

శ్రుతి॥ దేహోహమితి-సంకల్పో - మహాపాప - మితిస్ఫుటం॥ తేజోబిందూపనిషత్తు.

తాత్ప॥ దేహత్రయసాక్షిగానుండు ఆత్మయేతానని తెలియక దేహ మేతానని అహంకారమే మహాపాపము, దీనికంటెపాపములేదు.

శ్రుతి॥ దేహోహమితి-యద్జ్ఞానం-తదేవ-నరకం-స్మృతం॥ తేజో

తాత్ప॥ దేహమేతాననెడి అహంకారమే మహానరకమనబడును.

శ్రుతి॥ నివృత్తిఃపరమా-తృప్తి-రానందోనుపమ-స్మృతః॥అధ్యాత్మో

తాత్ప॥ సకలవృత్తులు శూన్యమై బ్రహ్మానుసంధానము చేయుచు, తదాకారముగానుండుటె పరమతృప్తి, పరమానందమనబడును.

## బ్రాహ్మణ లక్షణము.

---

శ్రుతి॥ జ్ఞానదండా-జ్ఞానయజ్ఞోప-వీతినః।శిఖా-జ్ఞానమయీ-యస్య ఉపవీతంచ-తన్మయం। బ్రాహ్మణ్యం-సకలంతస్యేతి॥ కాట్యాయనీయోప

తాత్ప॥ బ్రహ్మమే నేను, నేనేబ్రహ్మమను ఏకత్వజ్ఞానమే ఏకదండము, లేక త్రిదండముగాను, ఈజ్ఞానమే శిఖాయజ్ఞోపవీతములుగాను ధరించి నట్టివారే బ్రాహ్మణులు, బ్రహ్మజ్ఞానులు. నూలుపోగులు జంధ్యము వెం డ్రుకలు శిఖ మొదలైనవి ధరించినవారు బ్రాహ్మణులుగాజాలరు.

శ్రుతి॥ నచర్మణో-నరక్తస్య-నమాంసస్య-నచాస్థినః నజాతి-రాత్మనో। జాతిర్వ్యవహారః-పరికల్పితా॥ నిరాలంబోపనిషత్తు.

తాత్ప॥ పరబ్రహ్మమగు ఆత్మకు జాతిభేదములులేదు. ఐతే శరీరమునకైనను జాతిభేదములు గలదా అని యోచించిచూడగా, లోకమున అందఱి శరీరమున్ను చర్మమున్ను, రక్తము, మాంసము, ఎముకలు మొదలైనవానితో చేయబడినవేగాని, ఎవరికిన్ని బంగారుశరీరము లేదు. కాబట్టి అందరున్ను ఏకజాతియే. బ్రాహ్మణుడు శూద్రుడు మాలవాడు అనుజాతిభేదము ఎంతమాత్రమున్ను లేదు సుమా. లోకవ్యవహారమునందు నానాజాతిభేదములు అజ్ఞానులు కల్పించుకొనిరేగాని, సత్యముగా అందరున్ను ఒక్కజాతియే, అందఱియందుండు ఆత్మయు ఒక్కడేగాన, ఆత్మకున్ను జాతిభేదములులేదు సుమా.

శ్రుతి॥ తతో-బ్రాహ్మణః-సమాహితో-భూత్వా-తత్వంపద్యైక్య-మేవసదా-కుర్యాత్॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ శాంతిశమదమాది సద్గుణములుగలిగిసదాఆత్మస్వరూపుడగు నేనేపరబ్రహ్మము అపరబ్రహ్మమేనేనని, అభేదముగాదలంచి, ఆత్మధ్యానముచేయువాడే బ్రాహ్మణుడుగాని తక్కినవారు బ్రాహ్మణులుగాజాలరు.

శ్రుతి॥ య-ఏవం-వేదాహం - బ్రహ్మాస్మీతి । స-ఇదంసర్వం-భవతి। నతస్యహ-నదేవాశ్చ-నాభూత్యా-ఈశతే। ఆత్మా హ్యేషాం-సభవతి॥ అథయోన్యాం-దేవతా - ముపాసతే-అన్యో । సావన్యోహ-మస్మీతి న-సవేద-యథా-పశురేవం - సదేవానామితి॥ శ్వేతాశ్వతరోపనిషత్తు.

తాత్ప॥ ఎవడు ఆత్మస్వరూపుడగు నేనేబ్రహ్మము బ్రహ్మమేనేనని ఎరిగి ఆత్మధ్యానము చేయుచున్నాడో వానింజూచి ఇతడే బ్రహ్మజ్ఞాని అని సకలదేవతలు సంతోషించి ఆజ్ఞానివెంటనే తిరుగుచు వానికి సకలమర్యాదలు చేయుచుందురు. ఐతే ఎవరు అట్టి ఆత్మధ్యానమునువిడిచిపెట్టి ఇతరదేవతలను ధ్యానించుచున్నారో వారు అపరబ్రహ్మమును తెలియజాలరు. ఎవడు బ్రహ్మమువేరు ఆత్మవేరుగా తలంచుచున్నాడో అటి భేదబుద్ధిగలవాడు పశువుతో సమానుడగుచున్నాడు.

శ్రుతి॥ జాతం-మృతమిదం-దేహం-మాతాపితృ-మలాత్మకం।సుఖదుఃఖాలయా మేధ్యం-స్పృష్ట్వా-స్నానం-విధీయతే ॥౧॥ ధాతుబద్ధం-మహారోగం-పాపమందిర-మధ్రువం।వికారాకార-విస్తీర్ణం-స్పృష్ట్వాస్నానం-విధీయతే॥౨॥ నవద్వార-మలస్రావం-సదా కాలే- స్వభావజం।దుర్గంధం దుర్మలోపేతం-స్పృష్ట్వా-స్నానం-విధీయతే ॥3॥ మైత్రేయోపనిషత్తు.

తాత్ప॥ చావుపుట్టుకలుగల ఈ దేహము తల్లిదండ్రులయొక్క శుక్ల శోణితములనెడి మలమువల్ల బుట్టెనది. కొంచెము సుఖము కొంచెము దుఃఖముగలది. గబ్బుకొట్టుచు అసహ్యమైనది, ఇట్టి శరీరమే ఎల్లవారికి నున్నదిగాన, దీనిని అంటినమాత్రమున స్నానము చేయవలయునుగాని, ఆత్మ పరిశుద్ధుడు అతనికి యేదోషములున్ను లేదు జాతిభేదములున్ను లేదు ॥౧॥ కండలు, ఎముకలు, ప్రేగులు, నరములు మొదలైన సప్త ధాతుమయమై మహారోగములకు స్థానమై మహాపాపమువలన వచ్చినట్టి వికారముగానుండు ఈ శరీరమును అంటినమాత్రమున స్నానము చేయవలయునుగాని, ఆత్మ ఏదోషములున్ను లేనివాడు జాతిభేదములు లేనివాడు.॥3॥నవరంధ్రములందుసదా మలముకారుచు దుర్గంధముగా మలమూత్రములకు తొట్టిగానుండు ఈచండాలశరీరము ఎల్లవారికి ఉన్నదిగాని ఒక్కరికైనను బంగారుశరీరమూ, లేక పరిశుభ్రమైన శరీరము లేదు. కాబట్టి జాతిభేదము తలచరాదు. ఈశరీరమును అంటినమాత్రమున స్నానముచేయవలయును. ఆత్మ పరిశుద్ధుడై అందరియందును ఒక్కడేయున్నాడుగాన, అతనికి జాతిభేదములు కులగోత్రములులేవు.

శ్లో॥ అంత్యజాతిః-ద్విజాతిశ్చ-ఏక ఏవ-సహోదరాః। ఏకయోని-ప్రసూతత్వాత్ । ఏకశాఖేన-జాయతే॥

తాత్ప॥ లోకమున మాలవాడున్ను బ్రాహ్మణులున్ను వీరిద్దరున్ను మాత్రయోనియందుండి పుట్టినందువలన వీరిద్దరున్ను సహోదరులే, ఒక్క శాఖవారేజాతిభేదమేలేదుసుమా.(మనోర్జాతాః-మనుజాః-మనుష్యాః) మనుష్యులందరు మనుబ్రహ్మకు పుట్టినందువలన ఏకజాతిసహోదరులు.

శ్రుతి॥ సర్వసఙ్గ-పరిత్యజ్య-నిర్మమో-నిరహంకారో-భూత్వా

బ్రహ్మైకం-శరణముపగమ్య।తత్త్వమసి-సర్వంఖల్విదం-బ్రహ్మ-నేహనానాస్తి-కించనేత్యాది। మహావాక్యార్థానుభవ-జ్ఞానాద్బ్రహ్మైవాహమస్మీతి-నిశ్చిత్య-నిర్వికల్పసమాధినా-స్వతంత్రో-యతిశ్చరతి।సన్న్యాసీ-సముక్త-స్సపూజ్య-స్సయోగీ-సపరమహంస-స్సోవధూత-స్సబ్రాహ్మణ-ఇతిచ॥ నిరాలంబోపనిషత్తు.

తాత్ప॥ అనిత్యమైన సంసారదుఃఖ విషయములగు పుత్రమిత్ర కళత్రక్షేత్రాది సకలమునకు నేనేయజమానుడను అనెడి అహంకారమున్ను ఇదినాది ఇదినాది అనెడి మమకారమున్ను సకలమనోవ్యాపారములున్ను విడిచిపెట్టి బ్రహ్మమునుధ్యానించుచు, మహావాక్యార్థమును దెలిసి, తర్వాత తత్త్వవివేకమువలన ఆబ్రహ్మమేనేను నేనేఆబ్రహ్మమని నిశ్చయించుకొని సకలముమఱచి, నిర్వికల్పసమాధినిష్ఠను ఆత్మసాక్షాత్కారముంబొందినవాడే సన్న్యాసి, ముక్తుడు, పూజ్యుడు, రాజయోగి, పరమహంస, అవధూత, బ్రాహ్మణుడు. కాషాయవస్త్రము కట్టుకొనుటవలన సన్న్యాసియు, కౌపీనములేక తిరుగుటవలన అవధూతయు,నూలుపోగుల జంధ్యమునువేసుకొనుటవలన బ్రాహ్మణుడున్ను గాజాలడు.

## అఖండ జ్ఞానము.

---

శ్రుతి॥ చిదిహాస్తీతి-చిన్మాత్రమిదం-చిన్మయమేవచ। చిత్త్వం-చిదహమేతేచ-లోకాశ్చిదితి-భావయ॥ యాజ్ఞవల్క్యోపనిషత్తు.

తాత్ప॥"ఓ ఆంజనేయా జ్ఞానస్వరూపమగు పరబ్రహ్మమే ఇక్కడనున్నది. ఈప్రపంచము సర్వము ఆచిన్మయబ్రహ్మమే, నీవునేను మనమిద్దఱమున్ను ఆబ్రహ్మస్వరూపమే. ఈరేడు పదునాలుగు లోకములున్ను సకల చరాచరములున్ను సర్వము బ్రహ్మమే అని భావింపుము.

శ్రుతి॥ నతు-తద్ద్వితీయ-మస్తి। తతోన్యత్-విభక్తం-యత్పశ్యేత్॥ బృహదారణ్యోపనిషత్తు.

తాత్ప॥ పరబ్రహ్మమునకంటె వేరుగా కాండవది ఏదియులేదు, సర్వముబ్రహ్మమే, ఎది ఆబ్రహ్మమునకంటె వేరుగానున్నదని చెప్పవచ్చును.

శ్రుతి॥ యత్రహి-ద్వైతమివ-భవతి। తదితర-ఇతరం-పశ్యతి । తదితర-ఇతరం-జిఘ్రతి-ఇత్యాది । సర్వ-మాత్మైవాభూత్-తత్కేన-కం-పశ్యేదితి॥ బృహదారణ్యోపనిషత్తు.

తాత్ప॥ పరబ్రహ్మమగు ఆత్మ ఒక్కటియే నానావిధ రూపనామములతో సకలచరాచరజగత్తుగా ద్వైతముగా తోచుచు, ఒకటి మరియొకటిని చూచుచున్నది, ఒకటి మరియొకటిని వాసనచూచుచున్నది ఒకటి మరియొకటి వినుచున్నది, ఒకటి మరియొకటితో మాట్లాడుచున్నది, ఒకటి మరియొకటిని అంటుచున్నది. ఎది దేనిచూచెను, ఎది దేనితో మాట్లాడెను, అనగా చూచునది చూడబడినది, వినునది వినబడినది, అంటునది అంటబడినది మొదలగుసర్వము బ్రహ్మమేగాని, దానికి రెండవపదార్థము లేదని అభిప్రాయము.

శ్రుతి॥ ఉపాదానం-ప్రపంచస్య- బ్రహ్మణోన్య- న్నవిద్యతే । తస్మాత్సర్వ - ప్రపంచోయం- బ్రహ్మైవా స్తి- నచేతరేత్ । బ్రహ్మణ-స్సర్వభూతాని-జాయంతే-పరమాత్మనః । తస్మాదేతాని- బ్రహ్మైవ- భవంతీతి-విచింతయ॥ యథాతరంగ-కల్లోలై - ర్జలమేవం-స్ఫురత్యలం । ఘటనామ్నా-యథా-పృథ్వీ । పటనామ్నాహి-తంతవః । జగన్నామ్నా-చిదాభాతి-సర్వం - బ్రహ్మైవ- కేవలం॥ యోగశిఖోపనిషత్తు.

తాత్ప॥ ఆంజనేయా శ్రద్ధతో వినుము. బంకమట్టి, కుమ్మరవాడు, కుమ్మరి చక్రము, ఈమూడు ఉండుటవలన కుండ గలుగుచున్నది. కారణములేకుండా కార్యము జరగదు. అట్లు బంకమట్టివలన కుండగానగుచున్నదిగాన, కుండకు బంకమట్టి ఉపాదానకారణము అనబడును. కుమ్మరవాడు లేకుంటె కుండ గాజాలదుగాన ఆకుండకు కుమ్మరవాడు నిమిత్తకారణము. ఆకుమ్మరవానికి చక్రము సహాయముగా లేకుంటె వాడు కుండను చేయజాలడుగాన ఆకుండకు చక్రము సహకారి కారణమనబడును. ఈమూడుకారణములు లేకుంటె కుండగాజాలదు. అట్లు ఈ జగత్తు గలుగుటకు పైజెప్పిన ఉపాదానకారణము నిమిత్తకారణము సహకారికారణము ఉండవలెనుగదా అనియోచిం

చిచూపగా, అట్లులేదు. (సృష్టేః పురా-నామరూప-వివర్జితం-జగత్ సదేవ-సౌమ్య-ఇదమగ్ర-ఆసీత్, ఆత్మైవా-ఇదమగ్ర-ఆసీత్.) అనెడు బృహదారణ్యోపనిషత్తు రీతిగా, సృష్టికిమునుపు ఈ ప్రపంచము నామ రూపములులేనిదై బ్రహ్మమొక్కటే ఉండెనుకాబట్టి జగత్తునకు నిమిత్త కారణ సహకారి కారణములు లేవు. ఉపాదానకారణమగు మట్టియే కుండగాతోచినట్లున్ను, నూలే వస్త్రముగాతోచినట్లున్ను, సముద్రజలమే అలలుగాతోచినట్లున్ను, ఉపాదానకారణమగు బ్రహ్మమే నానావిధ నామరూపములుగల దేవమానవ పశుపక్షిక్రిమికీటక వృక్షలతాది సకలచరాచర జగత్తుగా తోచుచున్నది. దానికి రెండవ వస్తువులేదు.

శ్రుతి॥ సఏష-బ్రహ్మా-ఏషఇంద్ర-ఏషప్రజాపతి-రేతే- సర్వేదేవా-ఇమానిచ-పంచ-మహాభూతాని-పృథ్వీ-వాయురాకాశ - ఆపోజ్యోతీంషిత్యేతానీమానిచ--క్షుద్రమిశ్రాణీవ-బీజానీతరాణిచేతరాణి- చాండజానిచ-జారుజానిచ-స్వేదజాని-చోద్భిజానిచాశ్వాగావః-పురుషాహస్తినో యత్కించేదం-ప్రాణిజంగమంచపతత్రిచ-యచ్చస్థావరం-సర్వం -తత్॥ ఐతరేయోపనిషత్తు.

తాత్ప॥ బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ఇంద్రుడు చంద్రుడు సూర్యుడు మొదలగు సకలదేవతలున్ను, ఆకాశాది పంచభూతములు, సకలబీజములు, (జరాయుజములు) అనగా తల్లిగర్భములో సంచిలోనుండి బుట్టెడు మనుష్యులు గుఱ్ఱములు గోవులు ఏనుగులు మొదలైన నాలుగుకాళ్ల మృగములు, (అండజములు) అనగా గ్రుడ్డులోనుండి బుట్టిన పక్షులు చేపలు పాములు మొదలైనజంతువులు, (స్వేదజములు) అనగా చెమట మురికిలోబుట్టిన క్రిమికీటకాదులు. (ఉద్భిజములు) అనగా భూమిలోనుండి మొలచిన చెట్లుతీగలు కొండలు మొదలైన సర్వముబ్రహ్మమే.

శ్రుతి॥ ఆత్మైవ-మమృతమిదం-బ్రహ్మేదం-సర్వం॥ బృహదారణ్యో

తాత్ప॥ సర్వము బ్రహ్మమే, బ్రహ్మమే ఆత్మగాన, సర్వము ఆత్మయే.

శ్రుతి॥ పురుష-ఏవేదం-విశ్వం । యస్మాత్పరం-నాపరమస్తి । తేనే

... -పరం॥ ముండకోపనిషత్తు.

తాత్ప॥ ఈప్రపంచంబు సర్వంబు బ్రహ్మమే. ఏపరమాత్మ తనకు అన్యమనియు సొంతమనియులేక సర్వము తానుగానున్నాఁడో వాఁడే ఈ విశ్వమంతయును నిండియున్నాడు.

శ్రుతి॥ నేహనానా స్తి-కించన, పురుషాన్న పరం-కించిత్ ॥కఠోపనిష

తాత్ప॥ ఈజగత్తు బ్రహ్మమునకంటెను వేరుగాలేదు, బ్రహ్మమునకంటెను అన్యముగా కించిత్తు వస్తువైనను లేదు.

శ్రుతి॥ పురుష-ఏవేదం-సర్వం-యద్భూతం-యచ్చభవ్యం। తదేవాగ్ని-స్తదాదిత్య-స్తద్వాయు-స్తదు-చంద్రమాః। తదేవశుక్రం - తద్బ్రహ్మ-తదాప-స్తత్ప్రజాపతిః॥ భోక్తా-భోగ్యం-ప్రేరితారంచ-మత్వా-సర్వంప్రోక్తం। త్రివిధం-బ్రహ్మమేతత్॥ శ్వేతాశ్వతరోపనిషత్తు.

తాత్ప॥ ఈప్రపంచము సర్వము బ్రహ్మమె. ఇదివరకు సృష్టిలోబుట్టినవన్నియు ఇకమీద పుట్టబోవునదన్నియు బ్రహ్మమే. అగ్ని, సూర్యుడు చంద్రుడు, వాయువు, శుక్రుడు ఇవియన్ని బ్రహ్మమే. జలము, ప్రజాపతి, బ్రహ్మమే. జీవుడు, జీవునిచేననుభవింపబడినవస్తువులు, ఈజీవునికర్మానుసారమగు ఫలముల ననుభవించునట్లుజేయు దేవుడు ఈమూడు బ్రహ్మమే.

శ్రుతి॥ ఏకమేవాద్వితీయం-బ్రహ్మ। సర్వం-ఖల్విదంబ్రహ్మ-తజ్జలానితి-ఇదంసర్వం-యదయమాత్మా। ఆత్మైవేదం-సర్వం॥ఛాందోగ్యోపనిషత్

తాత్ప॥ [illegible] (తజ్జలానితి) అనగా, తజ్జం= ఈజగత్తు బ్రహ్మమందుబుట్టి, తల్లం= బ్రహ్మమందేలయించును. తదనితి= బ్రహ్మమువల్లనే చేష్టించుననిఅర్థముగాన, బ్రహ్మమగుఆత్మ జగత్సర్వముతానుగానున్నది.

శ్రుతి॥ సర్వంనారాయణః। పురుష-ఏవేదం-సర్వం। యద్భూతం-యచ్చభవ్యం॥ సుబాలోపనిషత్తు.

తాత్ప॥ సర్వము నారాయణ పరబ్రహ్మమే. ఇదివరకు పుట్టినవి ఇకమీద పుట్టబోవునవి సర్వము బ్రహ్మమే.

శ్రుతి॥ సర్వం-చిన్మాత్రమేవహి-బ్రహ్మైవసర్వం-చిన్మాత్రం। బ్రహ్మమాత్రం-జగత్త్రయం॥ తేజోబిందూపనిషత్,

తాత్ప॥ సర్వము చిన్మాత్రమే, బ్రహ్మమే, త్రిలోకంబులు బ్రహ్మమే.

శ్రుతి॥ సబ్రహ్మా-సశ్శివ-స్సేంద్ర-సోఽక్షరః-పరమస్స్వరాట్॥ కైవల్యోప
తాత్ప॥ బ్రహ్మవిష్ణురుద్ర ఇంద్ర జీవ ఈశ్వరాదులు సర్వముబ్రహ్మమే.

శ్రుతి॥ దేవఏకో-నారాయణః।నద్వితీయోస్తి-కశ్చిత్। నారాయణ ఏవేదం-సర్వం॥ నారాయణోపనిషత్తు.

తాత్ప॥ నారాయణ పరబ్రహ్మము ఒక్కడే. అతనికి రెండవవస్తువు లేదు. జగత్తు సర్వము అపరబ్రహ్మమే.

శ్రుతి॥ చైతన్యందినా-కించిన్నాస్తి॥ నిరాలంబోపనిషత్.

తాత్ప॥ చైతన్యమే పరబ్రహ్మము, దానికిరెండవవస్తువుఏదిన్ని లేదు.

శ్రుతి॥ సర్వాణ్యేవైతాని-ప్రజ్ఞానస్య-నామధేయాని-భవంతి॥ ఐతరేయోపనిషత్తు.

తాత్ప॥ ప్రజ్ఞానమే బ్రహ్మమని ఆత్మయనిన్నీ చెప్పబడును. ఆత్మయే నానావిధ నామరూపములతోడ నానావిధ జీవజంతువులుగాను చిజ్జడములుగాను అగుచున్నదిగాన, సకలనామరూపములున్ను ఆత్మకే చెప్పబడుచున్నది. సత్యముగా ఆత్మకంటెజగత్తు వేరుగాలేదు, ఆత్మకు రెండవపదార్థములేనేలేదు. ఆత్మస్వరూపుడగునీవే సర్వముఅగుచున్నావు. ఎట్లనగా, ఎఱుక అనగా ఒకవస్తువుతోచుట, మఱపు అనగా తోచకుండుట. నీవు మేల్కొనియుండునప్పుడు నానారూపనామముల తో జగత్తుతోచును, ఇదే ఎఱుక అనబడును. మరల నీవు నిద్రించునప్పుడు ఏదిన్నితోచుటలేదు, ఇదే మఱవు అనబడును. ఈయెఱుకమఱపులే సంకల్ప వికల్పములనబడును. మనస్సే ఇట్లు ఎఱుకమఱపులుగా నగుచున్నది. మనస్సుతోచుటవలన సకలనామరూపములతోడ జగత్తు తోచుచుండును. నిద్రయందు మనస్సు లయించినంతనే నామరూపములతోడ జగత్తు తోచకుండును.కాబట్టి (మనఏవ-జగత్-సర్వం,జగత్సర్వం-చిత్తగోచరం, ప్రపంచస్య-మనఃకల్పితత్వాత్॥) అనెడి మండల బ్రాహ్మణోపనిషత్తురీతిని మనస్సే సకలజగత్తుగా తోచుచున్నది. సముద్రమునందుబుట్టిన అలలు ఆసముద్రమునకు వేరుగాలేనట్లు ఆత్మస్వరూపుడగు నీయందుతోచిన మనస్సున్ను ఆ మనోదృశ్యములగు నానారూ

పనామములతోడ జగత్తున్ను నీకంటె వేరుగాలేదుసుమా. ఐతే సముద్రమున్నందలి అలలు పుట్టిపుట్టి నశించుచున్నను సముద్రముమాత్రము,పుట్టుట నశించుట మొదలగు వికారములులేక సత్యముగానుండునట్లు,నీయందు బుట్టినట్టి మనస్సున్ను అమనోదృశ్యములగు సకల ప్రపంచమున్ను పుట్టిపుట్టి నశించుచున్నను ఆత్మస్వరూపుడగు నీవుమాత్రము పుట్టుట నశించుట మొదలగు వికారములేదిన్ని లేక, సదా సర్వసాక్షిగా నాశరహితుడై నిత్యానంద పరబ్రహ్మముగా నున్నావు.

శ్రుతి॥ యస్మిన్-సర్వాణిభూతాని-ఆత్మైవాభూత్-విజానతః। తత్రకో-మోహః-కశ్శోక-ఏకత్వమను-పశ్యతః॥ అనెడి ఈశావాస్యోపనిషత్తు రీతిగా ఎవడు ఆత్మస్వరూపుడగుతానే సర్వముగానున్నాడని యెరుగుచున్నాడో వాడు శోక మోహముల సమానముగా తలచుచున్నాడు.

శ్రుతి॥ తతఃపూర్ణం-స్వమాత్మానం - పశ్యేదేకాత్మనా-స్థితం। స్వయంబ్రహ్మ-స్వయంవిష్ణు- స్స్వయమింద్ర - స్స్వయం-శివః । స్వయం విశ్వమిదం- సర్వం - స్వస్మాదన్యం-నకించన॥స్వాత్మ-న్యారోపితా-శేషభాస-వస్తు-నిరాసతః। స్వయమేవ-పరంబ్రహ్మ-పూర్ణ-మద్వయ-మక్రియం॥ అధ్యాత్మోపనిషత్తు.

తాత్ప॥ ఆత్మస్వరూపుడగు నీవే సర్వపరిపూర్ణ పరబ్రహ్మమని తెలిసికొమ్ము. బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ఇంద్రుడు చంద్రుడు సూర్యుడు మొదలగునవి ఆత్మస్వరూపుడగు నీవే అగుచున్నావు, (అహమేవ-సకలో-ధికలోస్మి) అను శ్రుతిరీతిగా నీకంటెవేరుగా అణుమాత్రమైనవస్తువైననులేదుగాన నీవే సర్వమనియు పరబ్రహ్మమనియు భావింపుము. త్రాటినిజూచి సర్పమని భ్రమసినట్లు, భ్రమచేత ఆత్మస్వరూపుడగునీవు నిన్ను జీవునిగాను, జననమరణ నామరూప కులగోత్రములుగలవానిగాను తలంచుచున్నావు. ఐతే త్రాటిసర్పమును పరీక్షించిచూడగా ఇది త్రాడేగాని సర్పము గాదని తెలిసి ఆనందించునట్లు (నేతినేతి) అను వేదాంతవాక్య విచారణచే దేహేంద్రియాది ప్రపంచముసర్వము నీవుగాదని సకల భ్రమలను నాశనముచేసి సర్వాధిష్ఠాన సాక్షియగు కేవల నిర్వికార సర్వపరి

## పూర్ణ బ్రహ్మమే నీవని తెలిసి నీలోనే నిన్ను జూచి ఆనందించు మందుము

## మౌ న బో ధ

---

శ్రుతి॥ సంత్యక్త-వాసనా-న్మౌనాన్నృతేనాస్త్యుత్తమం-పదం॥ముక్తికో

తాత్ప॥ ఆంజనేయా! బ్రహ్మజ్ఞానికి సర్వవాసనా శూన్యమైన మౌనము వినా శ్రేష్ఠమైనపదము ఏదియును లేదు. ☞ మౌనము అనగా ప్రపంచధర్మ సంబంధముల విడిచి సకలసంకల్పములు నశించి బ్రహ్మస్వరూపుడై యున్నవానికి లభించెడి ఆనందస్థితి. ఈమౌనమునే ధ్యానమనియు చెప్పుదురు,—[శ్రుతి॥బాల్యేన-తిష్ఠాసేత్-బాల్యంచ-నిర్విద్య-పాండిత్యేన-తిష్ఠాసేత్।బాల్యంచ-పాండిత్యంచ-నిర్విద్య-మౌనేన-తిష్ఠాసేత్। బాల్యం-పాండిత్యం-మౌనంచ-నిర్విద్య-అథ-బ్రాహ్మణః॥] అనెడి బృహదారణ్యోపనిషచ్ఛ్రుతిరీతిగా, బాల్యమనగా-శ్రవణము; పాండిత్యమనగా మననము, మౌనమనగా-నిధిధ్యాసనము, ఈమూడు విడిచి తూష్ణీంభావుడవై శుద్ధతెలివిమాత్రముగా బ్రహ్మస్వరూపివై యుండుము.

శ్రుతి॥ హస్తం-హస్తేన-సంపీడ్య-దంతైర్దంతాన్-విచూర్ణ్యచ। అంగాన్యంగై-రివాక్రమ్య-జయేదాదౌ-స్వకం-మనః॥మహోపనిషత్తు.

తాత్ప॥ హస్తంహస్తేన=కర్మకాండమును జ్ఞానకాండముచేత ఖండించి, దంతైర్దంతాన్=సంకల్పవికల్పములనెడి దంతములను జ్ఞానదంతములచేత పొడిచేసి, అంగాన్యంగైః=యోగాష్టాంగములను జ్ఞానాష్టాంగములచే ఖండించి, మనస్సును బ్రహ్మమందు లయించునట్లు అభ్యాసముచేయుటచే మనోజయము సిద్ధించును.

శ్రుతి॥దేశాద్దేశాంతర-ప్రాప్తౌ-సంవిదో-మధ్యమేవ-యత్।నిమేషేణ-చిదాకాశం-తద్విద్ధి-మునిపుంగవ॥మహోపనిషత్తు.

తాత్ప॥ ఆంజనేయా! చిత్తము ఒకసంకల్పమునుండి మరియొక సంకల్పమునకు పోవుచుండగా ఆచిత్తమును దానిరాకపోకలను ఏతెలివి సాక్షిగా మధ్యనుండుచు ఎరుగుచున్నదో, ఆతెలివియే ☞ చిదాకాశము ప్రజ్ఞానము ప్రత్యగాత్మ పరబ్రహ్మము అనబడును,—అట్టి తెలి

వియే నీవని తెలిసి సకలముమఱచి తన్మయుంబుగాఆనందించుచుండుము.

శ్రుతి॥ ఘటాకాశ-మహాకాశ-మివాత్మానం-పరాత్మనిఖిలాప్యఖండ-భావేన-తూష్ణీంభవ-సదామునే ॥౧॥ చిదాత్మని-సదానందే-దేహారూఢ-మహంధియం।నివేశ్య-లింగముత్సృజ్య-కేవలోభవ-సర్వదా॥ అధ్యాత్మోపనిషత్తు.

తాత్ప॥ ఘటాకాశ మహాకాశములు ఏకమైనట్లు, ఆత్మయే పరబ్రహ్మమనియు బ్రహ్మమే ఆత్మయనియు ఐక్యభావమునుజెంది, ఆత్మస్వరూపుడగు నీవే బ్రహ్మమని నిశ్చయించుకొని సకలతలంపులు మఱచి, శిలరీతిగా కేవలజ్ఞప్తిమాత్రుండవై మౌనముగా ఊరకుండుము. ॥౧॥ దేహమే నేననెడి అజ్ఞానమును విడిచి, ప్రత్యగాత్మ పరబ్రహ్మమే నేను అని నిశ్చయించుకొని, సకల భ్రాంతులను నాశముచేసి సకలమునుమఱచి కేవల చిన్మాత్రుడుగా మౌనముగా ఊరకుండుము. ॥౨॥

శ్రుతి॥ హృదయం-నిర్మలం-కృత్వా-చింతయిత్వా-ప్యనామయం।అహమేవ-పరంసర్వమితి-పశ్యేత్పరం-సుఖం॥ పైంగలోపనిషత్తు.

తాత్ప॥ హృదయము నిర్మలముగాజేసుకొని, అపరబ్రహ్మమే నేననియు, నేనే సర్వమనియు, మౌనముగా ఊరకుండుటే పరమసుఖము.

శ్రుతి॥ స్వరూపానుసంధాన-వ్యతిరిక్త-అన్యశాస్త్రాభ్యాసై-రుష్ట్రకుంకుమ-భారవత్-వ్యర్థతా॥ సన్యాసోపనిషత్తు.

తాత్ప॥ తానే బ్రహ్మమని తెలిసి స్వస్వరూపానుసంధానముచేయుచు ఆనందించుటనుమాని, వేదశాస్త్రాదుల చదువుచు కాలమును వ్యర్థపుచ్చువాడు కుంకుమపువ్వును మోసెడి గాడిదెకు సమానుడు.

శ్రుతి॥ తస్మాత్సర్వం-పరిత్యజ్య-తత్వనిష్ఠో-భవానఘ॥ తురియాతీతావధూతోపనిషత్.

తాత్ప॥ సంకల్పములన్నియు విడిచి చిన్మాత్ర సాక్షిగానుండుము.

శ్రుతి॥ వాసనాస్త్వం-పరిత్యజ్య-అంతశ్శాంత-సమస్తేహా-భవ-చిన్మాత్రవాసనః॥తామప్యథః-పరిత్యజ్య-మనోబుద్ధిసమానతాంశేషస్థిరసమాధానో-మయిత్వం-భవమారుతే।అశబ్దమస్పర్శ-మిత్యాది॥ ముక్తికో

తాత్ప॥ ఆంజనేయా! వాసనాత్రయమును, మోక్షమునందలి యిచ్ఛనున్ను విడిచిపెట్టి, జగత్తుసర్వము అనిత్యము, పరబ్రహ్మమే సత్యమని బ్రహ్మమును ధ్యానించుము. తర్వాత ఆ ధ్యానమునున్ను విడిచి మనో

బుద్ధులుకంటెని చంచలములేక స్థిరముగానిల్పి ఆబ్రహ్మమేనేనని సకల తలంపులు మఱచి తన్మయంబుగా మౌనముగా ఊరకుండుము.

## మా యా ల క్ష ణ ము.

---

☞ (శ్రుతి॥ ఆదిమధ్యావసానేషు-యామాయా-సామాయా) ఆదిమధ్యాంతములందు ఏదిలేనిదో అదే మాయ అనబడును. ఎట్లనగా [శ్రుతి॥ సదేవ-సౌమ్య-ఇదమగ్ర ఆసీత్, బ్రహ్మణో-రవ్యక్తః॥] అనునట్లు ప్రపంచ సృష్టికిమున్ను, ఆదిలో బ్రహ్మమొక్కటేయుండెను. అప్పుడు మాయ లేదుగాన, ఆదిలో మాయలేదని అభిప్రాయము. ఐతే సృష్టిలో ఇప్పుడు మధ్యలో ఉన్నట్లు కనబడుచున్నది. ఇట్లు కనబడుట రజ్జుసర్పమువలె భ్రాంతిమాత్రమేగాని సత్యముగాదుగాన, మధ్యలో ఇప్పట్లో కూడా లేదనియే అభిప్రాయము. మరల బ్రహ్మనిష్ఠయందును, అంత్యమునందును, అనగా ప్రళయమునందును గొడ్రాలుబిడ్డవలె బొత్తిగా కనబడక శూన్యమైపోవుచున్నదిగాన, అంత్యములోనున్ను మాయలేదనియే అభిప్రాయము. (మాయామయ-మిదమఖిలం-జగత్॥) ఈజగత్తు మాయాభ్రాంతివల్లనేతోచుచున్నది. ☞ (జాయతే-గచ్ఛతీతి-జగత్॥) ఇంద్రజాలమువలె నానావిధ నామరూపములతో తోచి, మరల తోచక అసత్యముగాబోవునదే జగత్తు అనబడునుగాన, (శ్రుతి॥ ఇదంప్రపంచం - నాస్త్యేవ-నోత్పన్నం-నోస్థితం । మాయాకార్యాదికం-నాస్తి-మాయానాస్తి-భయంనహి । వంధ్యాకుమార-వచనే - భీతిశ్చేత్-అస్త్విదం-జగత్॥) అనెడు తేజోబిందూపనిషత్తురీతిగా ఈ ప్రపంచము నీకంటె అన్యముగాలేదు. ఈప్రపంచము పుట్టనేలేదు. ఇంద్రజాలమునందు దోచునట్టి వస్తువులు ఎట్లు అసత్యములో, అట్లు మాయయు ఈ మాయవలన దోచిన నామరూప జగత్తున్ను అసత్యములే. గొడ్రాలిబిడ్డ మనలను చంపవచ్చుచున్నాడను మాట నిజముగానుండినయెడల, మాయయు మాయాకార్యమగు జగత్తున్ను కలదనిచెప్పవచ్చును, కాబట్టి మాయయు మాయాకార్యమగు జగత్తున్ను అసత్యములే. భ్రాంతివల్లనే జగత్తు తోచుచుండును, భ్రాంతిలేనియెడల జగత్తు లేనేలేదు. నీవు భ్రాంతిపడకుము, నీవేబ్రహ్మము. నీవు ఒక్కడవేయున్నావుగాని నీకన్యముగా ఏదిన్ని లేదని నిర్ణయముగానుండుము. [ శ్లో॥ [illegible]

[illegible] సాగరం । యద్వద్వాసే-స్థితం। తత శ్చైతతి

హస్తమస్తక-పదప్రోద్భూత-నానాంకురం। పర్యాయేణ-శిశుత్వ-యౌవన-జరా-వేషైరనేకై-ర్వృతం। పశ్యత్యత్తి-శృణోతి-జిఘ్రతి-యథాగచ్ఛత్తథా-గచ్ఛతి॥] ఆంజనేయా! మాయావిచిత్రము ఏమని చెప్పవచ్చును. పురుషుని గర్భమునుండి జడమగు శుక్లము స్త్రీగర్భమునందు శోణితముతోడగలిసి పిండరూపమై, తర్వాత కాళ్లు చేతులు తల కన్నులు ముక్కు చెవులు మొదలగు అవయవములతోడ స్థూలశరీరముగానగుచు జీవత్వముం బొంది తల్లిగర్భమునుండి శిశువుగాబుట్టి నానాట బాల్య యౌవన కౌమార వార్ధక్యాది వయోవికారంబులం బొందుచు ఒకటిని ఒకటి చూచుచు తినుచు వినుచు వాసనచూచుచు నవ్వుచు ఏడ్చుచు ఆట్లాడుచు మాట్లాడుచు ఇట్లు వింతవింతలుగా అనేకకార్యములు చేయుచు, మరల అకస్మాత్తుగా ఉన్నట్లుండి ఎట్లువచ్చినదో అట్లు చెప్పకపారి పోవుచున్నది. అహా జీవములేనట్టి జడపదార్థమగు శుక్లమేగదా ఇట్లు వింతలు వింతలుగా నామరూపములతో తోచి, మరల నామరూపములేమియు తోచక శూన్యముగాబోవుచున్నది. ఇంతకంటెనుగొప్ప ఇంద్రజాలవిద్య వేరెలేదు, ఇంద్రజాలమువంటి ఈమాయాభ్రాంతివల్లనే జగత్తు తోచుచున్నదిగాని, భ్రాంతిలేనివారికి జగత్తు లేనేలేదు సుమా! (శ్రుతి॥ నాసదాసీత్ నోసదాసీత్ తదానీం-తమఆసీత్॥) అనునట్లు ఈమాయ రజ్జుసర్పమురీతిని సత్తుగాక అసత్తుగాక (అనిర్వచనీయమై) అనగా ఇట్టిదట్టిదని చెప్పరానిదిగానున్నది. ఎట్లనగాదూరమునందుండు త్రాడు సర్పముగా కనబడుచుండును, సమీపమునజేరి పరీక్షించి చూచినయెడల అది సర్పముగా కనబడదుగాన, దానిని సత్తనిచెప్పరాదు. ఐతే అసత్తని చెప్పదామంటె గొడ్రాలిబిడ్డవలె బొత్తిగా కనబడకనేయుండవలయును. అట్లులేదు. దూరముగానుండి చూచిన సర్పముగానే కనబడుచున్నదిగాన, దాని అసత్తనియుచెప్పరాదు. ఐతే సదసత్తని చెప్పదామంటె (సత్తనగా-ఉన్నదనియు, అసత్తనగా లేదనియు, అర్థము) ఈసదసత్తులు రెండున్ను ఒకటికొకటి విరోధలక్షణములుగానున్నవి. ఒకవస్తువునకే ఇట్లు సదసత్తు లక్షణములు రెండున్ను ఉండజాలదుగాన, త్రాటియందుతోచిన సర్పమును సదసత్తనియు చెప్పరాదు, మొదట త్రాడు, సర్పముగా, సత్తుగా కనబడుచుండును. పరీక్షించిచూచినవెనుక అసత్తుగా కనబడకపోవును. ఇట్లు ఎది సదసత్తుగానుండునో అది వాస్తవముగా అసత్తే అగును; మరియు

సత్తుగాక అసత్తుగాక నుండువస్తువును (అనిర్వచనీయము) అని అనగా ఇట్టిదట్టిదని చెప్పరానిదనియు, భ్రాంతిరూపకమైనదనియు, చెప్పబడును, రజ్జుసర్పభ్రాంతిరీతిగా బ్రహ్మమునందు మాయయు దానికార్యమగు జగత్తున్ను ఉన్నట్లుతోచుట భ్రాంతిమాత్రమేగాని-[శ్రుతి॥ బ్రహ్మమాత్ర-మసన్నహి, నేహనానాస్తి-కించన, అతోన్యత్-సకలం-మృషా, జ్ఞాతే-ద్వైతం-నవిద్యతే,॥] ఇత్యాది శ్రుతులరీతిగా బ్రహ్మమొక్కటే యున్నదిగాని సత్యముగా మాయ లేనేలేదు, మాయాకార్యమగుజగత్తున్ను లేదు. ఇట్లు భ్రాంతిరూపకమైన అసత్తగు మాయ యున్నదని చెప్పుటవలన (ఏకమేవాద్వితీయం-బ్రహ్మ) అనునట్లు, సత్యమగు బ్రహ్మమొక్కటే, దానికి రెండవదిలేదని చెప్పు అద్వైతవాక్యమునకు హానిరాజాలదు. ద్వైతము కలుగజాలదుసుమా. ఐతే నానావిధరూపనామ క్రియలతోడ ప్రత్యక్షముగా కన్నులకు జగత్తు కనబడుచున్నదే ఎట్లు లేదనవచ్చును అని సందేహించినయెడల, జగత్తు మిథ్యయనుటకుగాను రజ్జుసర్ప దృష్టాంతమేగాని, అట్లు మిథ్య అనిరూరిగియు (అసత్-మృగతృష్ణవత్,గంధర్వనగరం-యథా)అనునట్లుఅది ఎండమావులరీతిగా కనబడుచుండును, ఐతే ఎండమావులందు తోచెడు జలమును ఎవరున్ను త్రాగినదిలేదు, దప్పితీరినట్లున్ను అనుభవములేదుగాని, ఈజగత్తునందు జలమునుత్రాగి దాహముతీరినట్లు అనుభవమున్నదిగాన, ఈజగత్తును ఎండమావులవలె ఎట్లు చెప్పవచ్చునని సందేహించినయెడల, స్వప్నమునందు దోచినవస్తువులను అనుభవించినను జాగ్రతావస్థయందు ఆవస్తువులున్ను దాని అనుభవమున్ను అసత్యములైనట్లు, జాగ్రతావస్థయందలి జగత్తున్ను దాని అనుభవమున్ను స్వప్నావస్థయందు కనబడక అసత్యములగుచున్నది. ఇట్లు ఒక అవస్థయందలి జగత్తున్ను దాని అనుభవమున్ను మరియొక్క అవస్థయందు తోచుటలేదు; మరియు ఈజాగ్రత స్వప్నములందు దోచు జగత్తులున్ను దాని అనుభవములున్ను నిద్రయందుబొత్తిగా తోచుటలేదుగాన, జగత్తు అసత్యమే. బ్రహ్మమొక్కటే సత్యము. జగత్తు పుట్టనేలేదు. (మాయామాత్ర-మిదం ద్వైతం, అద్వైతం-పరమార్థతః॥) అనెడి మాండూక్యోపనిషద్రీతిగా మాయాభ్రాంతివల్లనే జగత్తుతోచుచున్నదేగాని, సత్యముగాలేనేలేదు,

## పరి పూర్ణ బోధ.

శ్రుతి|| బ్రహ్మైవేద-మమృతం-పురస్తాత్ । పశ్చాద్బ్రహ్మ - దక్షిణత శ్చోత్తరేణ ।. అధశ్చోర్ధ్వంచ- ప్రసృతం - బ్రహ్మైవేదం-విశ్వమిదం-వరిష్ఠం|| ముండకోపనిషత్.

తాత్ప|| ఆంజనేయా సర్వము బ్రహ్మమే గాని వేరే ఏమిలేదు. ముందు వెనుక కుడిప్రక్కన ఎడమప్రక్కన క్రింద మీద సర్వత్ర సర్వపరిపూర్ణ పరబ్రహ్మము ఒక్కటేయున్నది, వేరే ఏమిలేదు. భ్రాంతిరూపకమైన ఈజగత్తు లేనేలేదు. ఆపరబ్రహ్మమే నీవని తెలిసికొమ్ము. [శ్రుతి|| దేహఇతి-శంకావతో-జడాజ్ఞా-సమాధాతుం-బాహ్యదృష్ట్యా-ప్రారబ్ధం-వదతి- శ్రుతిః । నతు-దేహాది-సత్యత్వ-బోధనాయ-విపశ్చితాం||] అనెడి అధ్యాత్మోపనిషత్తురీతిగా దేహాభిమానము గలవానికే ప్రారబ్ధము కలదుగాని దేహాదిప్రపంచము లేదన్నవారికి ప్రారబ్ధము లేనేలేదు.

శ్రుతి|| పూర్ణమదః-పూర్ణమిదం-పూర్ణాత్పూర్ణ - ముదచ్యతే । పూర్ణస్య-పూర్ణమాదాయ-పూర్ణ మేవావ-శిష్యతే|| బృహదారణ్యోపని.

తాత్ప|| అక్కడ ఇక్కడ ఎక్కడను పరిపూర్ణమే. లోకమున చంద్రుడు సూర్యుడు మొదలగునవి ఏదేది పరిపూర్ణమని చెప్పబడుచున్నదో దానికన్నిటికంటె ఈపరిపూర్ణమే శ్రేష్ఠమైనది, లోకములో ఎది ఎది పూర్ణవస్తువులో వానియందంతట ఈసర్వపరిపూర్ణ బ్రహ్మమే నిండియున్నది. ఆబ్రహ్మమే నీవని భావింపుము. (యద్దృశ్యం-తన్నశ్యం) నీకంటికి కనబడు వస్తువులన్నియు రూపులేక నశించిపోవునట్టివే. (దృశ్యం-సర్వమనాత్మేతి, దృగేవ-పరమాత్మా-తథా) నీకంటికి కనుబడు వస్తువులన్నియుం జడములుగాన అసత్యములగుచున్నవి. ఇన్నిటి నెరుగుచుండెడి సర్వసాక్షియగు నీవు ఒక్కడె ఎన్నటికిని నాశములేని పరిపూర్ణ పరబ్రహ్మము, నీకంటెవేరుగా ఏమిన్ని లేదు. నీలోనిన్ను జూచి ఆనందింపుము. అని శ్రీరామచంద్రుండుబోధింపగా ఆంజనేయుండుత్సాహించి స్వానుభవానందములోమునిగి, కొంతసేపటికి ప్రపంచజ్ఞప్తికలిగి లేచి శ్రీరాములచరణారవిందంబులకు సాష్టాంగ దండంబులుజేసి లేచి నిలుచుచు- [శ్లో|| దేహబుద్ధ్యాస్మి-దాసోహం-జీవబుద్ధ్యా-త్వదంశకః ఆత్మబుద్ధ్యా-త్వమేవాహమితి-మేనిశ్చితామతిః||](1) స్వామిశ్రీరామ

చంద్రా, ఈదేహము నేననెడితలంపుచేత, దేవరవారికి పాదసేవకుడుగా
ను, (2) క్షుత్పిపాసలు జననజరా మరణములుగల జీవుడు నేననెడి
తలంపుచేత, సర్వజీవసమష్టి స్వరూపుడై సర్వేశ్వరుండైన దేవరవారి
అంశముగాను, (3) దేహత్రయవిలక్షణ ప్రత్యగాత్మ పరబ్రహ్మమే నేన
నెడి తలంపుచేత, నేనేమీరు మీరే నేను అచ్యుతినని పలుకుచు తన స్వా
నుభవము ఇట్టిదని చెప్పుచున్నాడు.

## స్వానుభవానందము.

---

శ్రుతి॥ క్వగతం-కేన వానీతం-కుత్ర లీన-మిదం జగత్ । అధునైవ-మ
యాదృష్టం-నాస్తి కిం-మహదద్భుతం । కిం హేయం-కిముపాదేయం-కి
మన్యత్-కిం విలక్షణం । అఖండానంద-పీయూష-పూర్ణబ్రహ్మ-మహార్ణ
వే । న కించిదత్ర-పశ్యామి-న శ్రుణోమి-న వేద్మ్యహం । స్వాత్మనైవ-
సదానంద-రూపేణాస్మి-స్వలక్షణః । అసంగోహ-మసంగోహ-మలిం
గోహ-మహం హరిః । ప్రశాంతోహ-మనంతోహం-పరిపూర్ణ-శ్చిరంత
నః । అకర్తాహ-మభోక్తాహ-మవికారోహ-మవ్యయః । శుద్ధ-బోధ
స్వరూపోహం-కేవలోహం-సదాశివః॥ అధ్యాత్మోపనిషత్తు.

తాత్ప॥ ఈకనబడుచుండెడి నామరూపజగత్ సృష్టికిమునుపు ఎక్క
డపోయియుండెను, ఇప్పుడు ఎట్లువచ్చెను, మరల ఇది ప్రళయమున
ఎక్కడ లయించును, అనగా సృష్టికిమునుపు బ్రహ్మమొక్కటె యుండె
నుగాని జగత్తులేదనియు, ఇప్పట్లో భ్రాంతివల్లనే ఉన్నట్లు తోచుచు
న్నదనియు అభిప్రాయము. ఇప్పుడే ఈజాగ్రతావస్థయందే కనబడుచు
న్నదిగాని నిద్రావస్థయందు బొత్తిగాతోచుటలేదు. ఆహా ఇదిమిక్కిలి
ఆశ్చర్యము. ఇంతకన్న ఎక్కుడు ఆశ్చర్యమేమియునులేదు. ఇట్లు కనబ
డుట మాయాభ్రాంతివల్లనే. మనస్సే భ్రాంతిరూపముగానున్నది.
భ్రాంతిలేనియెడల జగత్తుతోచదు, అంతా పరిపూర్ణబ్రహ్మమే. గనుక
ఎది హేయము, ఎది అన్యము, ఎదివిలక్షణము, ఎది విధి, ఎదినిషేధము,
ఎదిశుద్ధము, ఎది అశుద్ధము, ఇవియన్నియు హుళక్కియే, అసత్యమే.
పరిపూర్ణ బ్రహ్మానందనిష్ఠలో నేను నాకంటె అన్యముగా ఏదిన్ని వినుట
లేదు, దేనినిన్ని చూచుటలేదు, నేను ఎదిన్ని ఎరుగుటలేదు, పరిపూర్ణబ్ర
హ్మముగా నాయందే నేను ఆనందించుచున్నాను.—[శ్రుతి॥ మయ్యేవ-స

[illegible]తం-మయిసర్వం-ప్రతిష్ఠితం॥ మయిసర్వం-లయంయాతి-తద్-బ్రహ్మాద్వ[illegible]-మస్మ్యహం॥] అనెడి కైవల్యోపనిషత్తురీతిగా.—(సముద్రమునందు గా[illegible] సంచారమువలన అలలు పలుమారు పుట్టిపుట్టి నశించునట్లు జ్ఞానానందసాగర స్వరూపియగు నాయందు మాయయనెడి గాలి సంచారమువలన ప్రపంచములనెడి అలలు పలుమారు పుట్టి పుట్టి నశించుచున్నవి.) ఆత్మస్వరూపుడగు నేను ఎన్నటికిని నాశములేనట్టి అద్వితీయ పరిపూర్ణ పర బ్రహ్మమగుచున్నాను.—[ శ్రుతి॥ ఉభే-విద్వాన్-పుణ్యపాపే-విధూయ-నిరంజనః । పరమం-సామ్యముపైతి॥] [illegible] నాకంటె అన్యముగా ఏ[illegible]లేదు, నాకు విధినిషేధములులేవు, నాకు పుణ్యమెక్కడిది పాపమెక్కడిది, అనగా సత్యముగా మనోవాక్కాయములనెడి త్రికరణశుద్ధిగా నేనుపుణ్యపాపములు చేయుటలేదని అభిప్రాయము.— నేను అసంగుండను నేను అసంగుండను, నేను గుణము లేనివాడను నేను స్త్రీనిగాను పురుషుడనుగాను నపుంసకుడనుగాను నాకుదేహమేలేదు, నేను అశరీరుడను, అచలుడను, నేనే హరిని, నేను ప్రశాంతుడను, నేను అంతములేనివాడను, నేనే పరిపూర్ణపరబ్రహ్మము. నేను (అకర్తను అభోక్తను) అనగా, నేను ఏకార్యములు చేయుటలేదు, ఏదిన్ని అనుభవించుటలేదు. నేను చావుపుట్టుకలు లేనివాడను, నేను నాశములేనివాడను నేను శుద్ధబోధస్వరూపుడను నేను కేవలాత్ముండను నేను నిత్యమంగళస్వరూపుడను అని యిట్లు ఆంజనేయుండు చెప్పగా శ్రీరామచంద్రుండు సంతసిల్లి చేరదీసిదగ్గిరకూర్చుండబెట్టుకొని ఇట్లనియె.

శ్రుతి॥ ప్రమాదో-బ్రహ్మనిష్ఠాయాం-నకర్తవ్యః - కదాచన । ప్రమాదో-మృత్యురిత్యాహు-ర్విద్యాయాం- బ్రహ్మవేదినః॥ 1 ॥ యథాపకృష్టం-శైవాలం-క్షణమాత్రం-నతిష్ఠతి । ఆవృణోతి-తథా-మాయా - ప్రాజ్ఞం వాపి-పరాఙ్ముఖం॥ 2 ॥ అనెడి అధ్యాత్మోపనిషత్తురీతిని, ఆంజనేయా! (1) ☞ సాధారణముగా ఎల్లవారికిగలుగు అవసానకాలము మృత్యువుగాజాల[illegible], బ్రహ్మనిష్ఠను మఱచుటే మృత్యువు. (2) ☞ ఒకతటాకజలములోని పాచిని ఎంతదూరముగా పోగొట్టినను, మరల వెంటనే ఆపాచి యథాప్రకారముగా ఆనీళ్లను కమ్ముకొనునట్లు ఎంతటి బ్రహ్మవేత్తయైనను బ్రహ్మనిష్ఠాభ్యాసమునందు శ్రద్ధలేక పరాకుగానుండెనేని, అతనిని ఆవరణ విక్షేప స్వరూపముగానుండు మాయాశక్తి తక్షణమే ఆక్రమించుకొని, అతనికి జననమరణంబులు గలిగించునుగాన, నీవు ఒకప్పు

డైనను, బ్రహ్మనిష్ఠాభ్యాసమును మఱువకయుండవలయు అనిఆశీర్వదించెను.

శ్రుతి॥ తద్విష్ణోః-పరమంపదం- సదాపశ్యంతి-సూరయః । దివీవ-చక్షురాతతం । తద్విప్రాసో-విపన్యవో-జాగృవాం - సస్సమింధతే । విష్ణోర్యత్-పరమంపదం॥ఓంసత్యమిత్యుపనిషత్॥ ఇదిబుఋక్వాక్యము.

తాత్ప॥ సర్వవ్యాపకమైన సచ్చిదానంద పరబ్రహ్మమును బ్రహ్మవేత్తలు తమస్వరూపముగా తెలియుచున్నారు. ఆపరబ్రహ్మము ఆకాశమువల సర్వత్ర వ్యాపించియున్నది. ఆపరబ్రహ్మము సర్వజీవుల హృదయములందు సాక్షిమాత్రముగానుండుచు, నేత్రము సకలరూపములను ఎరుగునట్లుగా, దేహేంద్రియాది ప్రపంచము సర్వమును ఎరుగుచున్నది. అహంకార మమకార శూన్యులైన బ్రహ్మవేత్తలు అట్టి పరబ్రహ్మమును తమ ఆత్మస్వరూపముగా ఎరిగి సదా (అహంబ్రహ్మాస్మి) అని ఆత్మానుసంధానమునుజేయుచు అభేద దృష్టితోడ వర్తించుచున్నారు.—

ఇది ఉపనిషత్సారరత్నావళి తాత్పర్యసహితము

సంపూర్ణము.

శ్రీరామచంద్రార్పణమస్తు.

